

# విషయానుక్రమణిక

## 11 జూలై 1951



---

## గమనిక

మా పాఠకులు వారంవారం చదివి ఆనందిస్తున్న "కౌంట్ ఆఫ్ మాంటే క్రిస్టో"లోని మొదటి 38 అధ్యాయాలు పుస్తకంగా వెలువడుతున్న సంగతి తెలుపుటకు ఆనందిస్తున్నాము —సంపాదకుడు



# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder K NAGESWARA RAO

సంపుటము 43
సంచిక 43
11.7-51

ఖర సంవత్సర ఆషాఢ శుద్ధ సప్తమి బుధవారము


# కాశ్మీర్: పాకిస్తాన్ తంత్రం



భద్రతామండలి తీర్మానాన్ని అనుసరించి కాశ్మీర్‌లో సైనికోపసంహారంకోసం ఐక్యరాజ్య సమితి నియమించిన 'మధ్యవర్తి' డా॥ ఫ్రాంక్ గ్రాహం భరతఖండానికి రావడంతో పాకిస్తాన్ ప్రచారమూ, దౌర్జన్య చర్యలూ ఉధృతమైనాయి యుద్ధవిరామ సంధి నియమాలకు విరుద్ధంగా ఈ మధ్య షేక్ అబ్దుల్లా పరిపాలనలో ఉన్న కాశ్మీర్ ప్రాంతంపైకి పాకిస్తానీ సైనికులు, పోలీసులు, సాయుధులైన దుండగులు దాడిచేసి కల్లోలం రెచ్చగొడుతున్నారు ఈవిషయమై భారత ప్రభుత్వం భద్రతామండలికి ఫిర్యాదు కూడా చేసింది భద్రతామండలి అధ్యక్షులు ఇంతవరకూ మౌనంగానే ఉన్నారు ఈపరిస్థితికి ఆంగ్లో - అమెరికన్ రాజ్యాల అనుచిత వైఖరే హేతువు

ఇదివరలో దుష్ప్రచారంవల్ల, దురాక్రమణవల్ల విదేశాల అనుగ్రహంవల్ల పాకిస్తాన్‌కి లబ్ధికలిగింది ఇప్పుడుకూడా ఆంగ్లో-అమెరికన్ దేశాల పక్షపాతవైఖరివల్ల తప్పకుండా తమతంత్రాలు నెరవేర గలవనే ఆశతో పాకిస్తాన్ ఈచర్యలకు దిగుతోంది దురాక్రమణ జరిపినా, అసత్య ప్రచారం చేసినా ఆంగ్లో అమెరికన్ రాజ్యాలు తమకే సహాయం చెయ్యగలవనే విశ్వాసం ఉన్నందువల్లనే పాకిస్తాన్ ప్రభుత్వం ఈ రీతిగా చెయ్యగలుగుతోంది

భద్రతామండలి తీర్మానానికి సమ్మతించకపోయినా భారతప్రభుత్వం 'మధ్యవర్తి' డా॥ ఫ్రాంక్ గ్రాహంను అతిథిగా సత్కరించింది ఆ తీర్మానం ప్రకారం ఈ 'మధ్యవర్తి' తక్షణ కర్తవ్యాలు రెండు 1 కాశ్మీర్‌లో రాజ్యాంగ పరిషన్నిర్మాణం కాకుండా నివారించడం 2 ఉభయ ప్రాంతాలనుంచీ సైన్యాలను ఉపసంహరించడానికి (అనగా పూర్వ కాశ్మీర్ కమిషన్ సూచనల ప్రకారం) కృషి చెయ్యడం

అయితే కాశ్మీర్ కమిషన్ సూచనలే సందిగ్ధంగా ఉన్నందువల్ల ఆంగ్లో-అమెరికన్ రాజ్యాలు కమిషన్ భారతప్రభుత్వానికి వాగ్దానాలను త్రోసిపుచ్చి, వారి సూచనలకు తమ స్వంత అర్థాలు కల్పించుకొని ఆ ప్రకారం సైనికోపసంహారణ జరిపే బాధ్యతను డా॥ గ్రాహంకు ఒప్పగించాయి

సైనికోపసంహారణ కర్తవ్యం ప్రస్తుత పరిస్థితులలో సాధ్యపడదని పాకిస్తాన్ ప్రస్తుత చర్యలే స్పష్టపరుస్తున్నాయి దురాక్రమణ జరిపిన పాకిస్తాన్ సైన్యాలను, దురాక్రమణను నిరోధించిన భారత సైన్యాలను ఒకేసారి ఉపసంహరించాలని భద్రతామండలిలోని ఆంగ్లో అమెరికన్ వర్గం అభిప్రాయం కాని వాస్తవంగా ఇలా జరిపినట్లయితే తిరిగి పాకిస్తాన్‌లోని పఠాన్ మూకలూ 'ఆజాద్ కాశ్మీర్' అని



రిపబ్లిక్ అధ్యక్షులు రాజేంద్రప్రసాద్‌తో డా॥ గ్రాహాం సమావేశం

చెప్పబడే పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతంలోని ‘ఆజాద్ కాశ్మీర్’ సేనలూ కాశ్మీర్‌పై దాడి చెయ్యగలవని వేరే చెప్ప నక్కరలేదు ఈ పరిస్థితిలో భారతప్రభుత్వం తన సైన్యాలను ఉపసంహరించుకోడానికి నిరాకరించక తప్పదు వెంటనే డా॥ గ్రాహం ‘మధ్యవర్తిత్వం’ కూడా భారత ప్రభుత్వం మొండిపట్టుదల వల్లనే విఫలమయిందని పాకిస్తాన్ ప్రచారం ప్రారంభించి ఆపైన ‘పరిష్కర్త’ను నియమిస్తేగాని తిరిగి యుద్ధం సంభవించకతప్పదని ప్రచారం చెయ్యవచ్చును

కాశ్మీర్ సమస్యను ఐక్యరాజ్యసమితి పేరుపైన ఆంగ్లో-అమెరికన్ రాజ్యాలు తమ కనుకూలుడైన పరిష్కర్త కొప్పగించి, ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కూడా విరుద్ధంగా పరిష్కరింపచెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు ఆ విధంగా పరిష్కర్తకు ఒప్పగించడానికి పాకిస్తాన్ సిద్ధంగానే ఉంది అందువల్లనే కాశ్మీర్‌లో షేక్ అబ్దుల్లా ప్రభుత్వం ఎన్నికలు జరిపించి రాజ్యాంగ పరిషత్తును నిర్మించడానికి చేస్తున్న యత్నాలకు భీతిచెంది, ఆంగ్లో-అమెరికన్ రాజ్యకూటం సహాయంతో ఎన్నికలకు తావులేకుండా పరదేశీయుల చేత తీర్పు చెప్పించడానికి కృషిచేస్తోంది కాశ్మీర్ రాజ్యాంగ పరిషన్నిర్మాణ యత్నాన్ని భగ్నపరచడంకోసం అక్రమోపాయాలను అవలంబిస్తోంది కాని ఈ తంత్రాలు నెరవేరవనీ, కాశ్మీర్ రాజ్యాంగ పరిషన్నిర్మాణాన్ని ఐక్యరాజ్యసమితి అంతా ఏకమై నివారించడానికి ప్రయత్నించినా కాశ్మీర్ ప్రజలు లొంగబోరనీ కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా ప్రకటించాడు

అందువల్ల డా॥ ఫ్రాంక్ గ్రాహంకు ఒప్పగించబడిన ప్రథమ కర్తవ్యం భగ్నం కాక తప్పదని ఇప్పుడే తేలిపోయింది డా॥ గ్రాహం భారతదేశంలో అడుగు పెట్టకముందే పాకిస్తాన్‌లో జీహాద్ (పవిత్ర మత యుద్ధం) ప్రచారమూ, దాడులూ, అధికమైనాయి ఆజాద్ కాశ్మీర్‌లో పాకిస్తాన్ సైనిక పరిపాలన నెలకొల్పి సైన్యాలను సమీకరించి తిరిగి దండయాత్రకు సిద్ధపడుతుందని వార్తలు వస్తున్నాయి కాశ్మీర్‌లో కల్లోలాన్ని రెచ్చగొట్టి రాజ్యాంగ పరిషన్నిర్మాణాన్ని నిరోధించడానికి ప్రయత్నిస్తోంది ఈ మారు దాడి సంభవించినట్లయితే అది భారతదేశంపైన జరిగినదిగా పరిగణించి, దురాక్రమణ పరులకు గుణపాఠం చెప్పగలరని ఇదివరలోనే భారత ప్రభుత్వం హెచ్చరించింది ఈ మారు భారత పాకిస్తాన్ల మధ్య యుద్ధం సంభవిస్తే, నిందను పూర్తిగా భద్రతామండలి పేరుతో కుతంత్రాలు నెరపుతున్న, పాకిస్తాన్‌కు అలుసిచ్చిన ఆంగ్లో-అమెరికన్ రాజ్యకూటమే భరించవలసి ఉంటుంది

## ముందుచూపు



కాశ్మీరుకు యాత్రికులరాకను పెంచడానికిగల సాధనోపాయాలను గురించి శ్రీనగరులో జరిగిన సభలో చర్చించబడింది.

(నేషనల్ హెరాల్డ్)

## రైల్వే కార్మికుల సమ్మె నిర్ణయం:

దేశమంతటా రైల్వే కార్మికులు బాలట్‌లో పాల్గొని సమ్మెకు సుముఖంగా నిర్ణయించిన తరవాత రైల్వే ఫెడరేషన్ జనరల్ కౌన్సిల్ ఖర్గపూర్‌లో సమావేశమై, ఆగస్టు 27 వ తేదీనుంచి సమ్మెచెయ్యడానికి తీర్మానించింది సమ్మె నిర్వహణ నిమిత్తం సమ్మెసంఘం నియమించబడింది అయితే ఇంకా రాయబార యత్నాలకు అవకాశంఉందని జై ప్రకాశ్ నారాయణ్ గారు వివరించారు

ఖర్గపూర్ సమావేశానికి ముందు భారత ప్రధాని పండిట్ నెహ్రూ సమ్మెచెయ్యవద్దని రైల్వే కార్మికులకు విజ్ఞప్తిచేశారు కార్మికుల నేటి కష్టాలు తమకు తెలియక పోవనీ, అయినప్పటికీ దేశంలో ఏర్పడిన క్లిష్టపరిస్థితివల్లనూ, ధనాభావంవల్లనూ భారత ప్రభుత్వం కార్మికులకు ఉద్యోగులకు జీతాలనుగాని కరువుభత్యాలనగాని హెచ్చించలేని స్థితిలో ఉందనీ పండిట్ నెహ్రూ చెప్పారు దేశంలోని ఇతర వర్గాలతోపాటు కొంతకాలం రైల్వే కార్మికులుకూడా ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో ఓపికపట్టవలసి ఉంటుందన్నారు ముఖ్యంగా భారతదేశంలో కరువు రాగల ప్రమాదం ఉన్నందువల్ల అమెరికానుంచి రానున్న ఆహారధాన్యాలను కొరవ ప్రాంతాలకు రవానా చెయ్యడంలో ఆటంకం కలిగినట్లయితే అనేకమంది కరువుకు బలైపోగల ప్రమాదం ఉంది ఒకవంక బొంబాయిలో మిల్లుగుడ్డ మార్కెట్‌లో ఎక్కువై ధరలు పడిపోతుంటే చెన్నరాష్ట్రంలో గుడ్డ కంటికే కనపడకుండా ఉండడానికి రవాణా సౌకర్యాల లోపమే కారణం ఈ పరిస్థితిలో రైల్వే రవాణా నిలిచిపోయినట్లయితే చెన్నరాష్ట్రంవంటి ప్రాంతాలపరిస్థితి అల్లకల్లోలమైపోతుంది అమెరికానుంచి రాగల ఆహారసామగ్రి రవాణా కాకపోయినా, వస్త్రం రవాణా కాకపోయినా దేశంలో కొన్ని ప్రాంతల కరువు రాక తప్పదు

అదీకాక రైల్వే కార్మికులకు ఈనాడు కరువు భత్యాలను రు 20 చొ॥ పెంచినట్లయితే ప్రభుత్వం ఇంతఖర్చును భరించనూ లేదు, మిగతా కార్మికులు, ఉద్యోగులు కూడా సమ్మె చెయ్యగలమని బెదిరించగలరు వారు బెదిరించకపోయినా, రైల్వే



పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

కార్మికుల కిచ్చినంత కరువుభత్య ప్రమాణాన్ని ఇతర ఉద్యోగులకు ఇవ్వవలసి వస్తుంది ఇంత ఖర్చును భారతప్రభుత్వం భరించలేకపోగా, దేశంలో వస్తువుల ధరలు ఇంకొకతెర పెరిగిపోతాయి దానితో వీరి కిచ్చిన కరువుభత్యం వృథా అయిపోతుంది మిగతా కార్మికులు ఉద్యోగులు, రైతుల స్థితి మరింత హీనమైపోతుంది

వీని నన్నిటినీ దృష్టిలో పెట్టుకు ప్రధాని పండిట్ నెహ్రూ చేసిన విజ్ఞప్తిని రైల్వే కార్మికులు నిరాకరించి సమ్మె చెయ్యడానికే నిర్ణయించారు

అయితే కిందటిమారు కూడా రైల్వే కార్మికులు సమ్మె చేయాలని నిర్ణయించి తరవాత విరమించుకున్నారు అలా విరమించుకోడానికి ప్రజల సానుభూతి లేకపోవడమే కారణమని అప్పుడు రైల్వే కార్మిక సంఘ సమితి అధ్యక్షులు జైప్రకాశనారాయణగారు చెప్పారు ఈనాడు కూడా ప్రజల సానుభూతివారికి లభించడం కష్టం దేశంలో అందరికంటె వారెక్కువ కష్టాల ననుభవించడంలేదని ప్రభుత్వ ప్రతినిధి ఒకరు తెలియచేశారు ఎలిమెంటరీ స్కూళ్ల ఉపాధ్యాయుల కంటె, జిరాయితీహక్కులు లేని పది హెక్టారాల భూస్వాములకంటె, రైల్వే కార్మికుల జీవనమే మేలుగా ఉందని ప్రభుత్వ ప్రతినిధి తెలిపారు అసలే ఆహార వస్తువులు వస్త్రింకరువైన ఈరోజుల్లో రవాణా సదుపాయాలకు సమ్మెలవల్ల ఆటంకం కలిగితే, అటువంటి సమ్మెలను ప్రజలు బలపరిచరు ఈ మారుకూడా రైల్వే కార్మికులు ఈకారణంపైనే సమ్మెవిరమించుకోక పోరనే ధైర్యం ప్రభుత్వానికీ, ప్రజలకూ కూడా ఉంది ఆగస్టు 27 నుంచి సమ్మె చెయ్యాలనే రైల్వే కార్మికుల తీర్మానమే తుది నిర్ణయం కాదు కరువు రోజుల్లో ప్రభుత్వం భయపడి కార్మికుల కోరికలను మన్నిస్తుందని వారి ఆశ కావచ్చును అదే అయితే, అటువంటి ఆశలు వ్యర్థమే కరువుభత్యం మినహా మిగతా సమస్యలను గురించి చర్చించడానికి గాని, ట్రిబ్యునల్ విచారణను ఒప్పగించడానికి ప్రభుత్వం సిద్ధంగానే ఉంది రైల్వే కార్మికులెంత బెదిరించినా ఇంతకుమించి వారు సాధించగలిగేది లేదు సమ్మెలూ, సమ్మె బెదిరింపులూ సాధనాలుగా కార్మికుల నందరినీ సంఘటితపరిచి తమ పార్టీని బలపరుచుకోగలరనే సామ్యవాద పక్షాల నాయకులు వి శ్వ సించి ఈ రీ తి గా చేస్తున్నట్లయితే అదీ వ్యర్థమే అవుతుంది ప్రస్తుతకాలంలో చేతగాని సమ్మెలవల్ల కార్మిక సంఘాలూ, రాజకీయపక్షాలూ కూడా ఐక్యత సంఘబలం కోల్పోయి విచ్ఛిన్నమౌతున్నాయి ప్రజల తోడ్పాటులేని కార్మికోద్యమం నిరర్థకమే అవుతుంది ప్రజల తోడ్పాటునూ, సహకార సానుభూతులనూ పొంది కార్మికోద్యమాన్ని బలపరచగోరుతున్నవారైతే సోషలిస్టులు సమ్మె చెయ్యనివ్వకూడదు

## వ్యవసాయ సంస్కరణలు

మద్రాసు ప్రభుత్వం నియమించిన సుబ్రహ్మణ్యం కమిటీ వ్యవసాయ సంస్కరణలను గురించి విచారణ జరిపి 126 సిఫార్సులతో తమ నివేదికను రాష్ట్రప్రభుత్వానికి అందజేసింది వీరి సూచనలలో ముఖ్యమైనవి రు 250 శిస్తుకుమించిన పొలం ఎవరికీ ఉండకూడదు కాని ఇప్పుడు అంతకుమించిన భూమికలవారి ఆస్తితో జోక్యం చేసుకో కూడదు ఇక ముందు రు 250 శిస్తు చెల్లిస్తున్నవారు పైన ఇంక పొలాన్ని కొనకూడదు అవిభక్తకుటుంబాలకు చెందిన ఆస్తిప్రమాణం నిర్ణయించేటప్పుడు కుటుంబంలోని జనాన్ని బట్టి రు 300 మొదలు రు 1000 వరకూ ప్రమాణం పెట్టుకోవచ్చును ఇకపైన భూములను వ్యవసాయంచేసే వారికేగాని ఇతరులకు ఎవరూ అమ్మరాదు ఆస్తి పంపకాల మూలంగా భూములు మరీ చిన్న చిన్న ఖండాలుగా విభజించబడకుండా కనీస ప్రమాణాలు నిర్ణయించిగాని మరొక పద్ధతిని గాని ప్రభుత్వం జాగ్రత్త వహించాలి చిన్న చిన్న ఖండాలు కలవారి మధ్య సహకారవిధానంపైన వ్యవసాయం చేసే పద్ధతిని ప్రోత్సహించాలి ఫలాని పరిమితిని మించి భూమిని సేకరించరాదనీ, సేద్యం చేయరాదనీ చేయబడిన సిఫార్సులు సహకార వ్యవసాయ సంఘాలకు, ఋతోదాయ, విద్యాలయ ధర్మసంస్థలకు వర్తించకూడదు స్త్రీలు, మైనర్లు, అవధ్యులు నౌకర్లను నియమించి సేద్యం చేయిస్తే, వారిని గైర్‌హాజర్ భూస్వాములుగా పరిగణించకూడదు సమష్టి వ్యవసాయం కాని ప్రభుత్వం స్వయంగా సేద్యం చేయించడం కాని మంచిది కాదు కౌలుదార్ల హక్కులను నిర్వచించి వారిని కాపాడ్డానికి ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవాలి పంటలో కనీసం నూటికి 60 వంతులు కౌలుదారుకి 40 వంతులు పట్టాదారుకి లభించేవిధంగా ప్రభుత్వం శాసనం చెయ్యాలి సేద్యపు ఖర్చుల్ని కౌలుదారు, పన్నుల్ని పట్టాదారుభరించాలి కౌలుదార్లకు పట్టాదార్లకు మధ్య వచ్చే తగాదాలను పరిష్కరించడానికి ట్రిబ్యునల్స్‌ను నియమించాలి పంటధాన్యం అమ్మకానికి కనీసపు ధరలు లభించేలా ప్రభుత్వం నియమాలు విధించాలి

వ్యవసాయకూలీలకు కూడా కనీసపు కూలి దొరికేలా శాసనం చెయ్యాలి ఆడవాళ్లకు మగవాళ్లకు కూలి సమానంగా ఇవ్వాలి, త్వరలోనే రాజకీయ బాధితులకు పూర్వసైనికులకు భూముల నివ్వడం ముగించి ఆపైన భూమిలేని వ్యవసాయ కూలీలకు భూమిఇచ్చే ఏర్పాట్లుచెయ్యాలి

(42-వ పేజీ చూడండి)



జయప్రకాశ్ నారాయణ




## ఆదివారం, జూలై 1.

—యుద్ధవిరామ ప్రతిపాదనకు సమ్మతిస్తున్నట్లు ఉత్తరకొరియా, చీనాకమ్యూనిస్టు సేనాధిపతులు సమితి సేనాని జనరల్ రిడ్జివేకి తెలియచేశారు జూలై 10,15 తేదీల మధ్య సరిహద్దులో నున్న కైసాంగ్‌లో సమాలోచనలు జరపాలని కమ్యూనిస్టు సేనాధిపతులు సూచించారు.

—కొరియాలో శాంతిప్రతిపాదనలవల్ల మెకార్థర్ బర్తరఫ్ విచారణ సంఘం నివేదికను ప్రచురించకుండా వాయిదా వేసింది

—విధ్వంసక నివారణ శాసనాన్ని పర్షియన్ మజ్లిస్ వాయిదా వేసినట్లు టెహరన్ రేడియో ప్రకటించింద

—థాయిలాండ్‌లో నౌకావిప్లవం అణిచివెయ్యబడింది ప్రధాని సంగ్రామ్ విడుదలై తిరిగి అధికారం స్వీకరించాడు

—కొలంబో ఆర్థికాభ్యుదయ ప్రణాళిక (ఆస్ట్రేలియా, కెనడా, సింహళం, ఇండియా, పాకిస్తాన్, న్యూజీలాండ్, వియత్‌నమ్, కాంబోడియా, లావోస్, ఇండోచీనా, మలయా, సింగపూర్, సారవాక్ ఉత్తరబోర్నియోలలో) నేటి నుంచి అమలు జరుగుతుంది

—పరిశ్రమల కవసరమైన ముడిసరకు ఉత్పత్తిపైనా, పంపకంపైనా అమెరికన్ ప్రభుత్వం నేటినుంచి కఠిన నిర్బంధాలు విధిస్తున్నది

—స్టెర్లింగ్ ఋణాల చెల్లింపు విషయమై బ్రిటన్, ఈజిప్టులు పదేళ్ల ఒడంబడిక చేసుకున్నాయి

—యుద్ధవిరామ సంధికి విరుద్ధంగా కాశ్మీర్‌లో భారత సైన్యాల ఆక్రమణలో ఉన్న ప్రాంతంపై జరుగుతున్న పాకిస్తానీ దాడులను అరికట్టితే కాని, సంభవించగలదుష్ఫలితాలకు పాకిస్తాన్ ప్రభుత్వం బాధ్యతవహించవలసి వస్తుందని భారత మంత్రి శ్రీగోపాలస్వామి అయ్యంగార్ హెచ్చరించారు.

—కాశ్మీర్‌లో పాకిస్తానీల దాడులను గురించి విచారించడానికి సమితి సైనిక పర్యవేక్షకుడు మేజర్ జనరల్ నిమ్మో రావల్పిండి వెళ్లాడు

—ప్రజాపార్టీ ఏ ఆశయాలతో ఎన్నికలలో పాల్గొంటుందో కృపలానీగారు గౌహతీ పత్రికాసమావేశంలో వివరించారు

—భారతదేశమంతటా వన మహోత్సవం జరపబడింది

## సోమవారం, జూలై 2.

—కొరియాయుద్ధ విరమణ ప్రతిపాదనను కేవలం సైనిక సమస్యగా మాత్రం పరిగణించి సమాలోచనలు జరుపుతారని అమెరికన్ విదేశాంగ మంత్రి జనరల్ మార్షల్ ప్రకటించాడు

—కొరియాయుద్ధం విరమించరాదని దక్షిణకొరియన్ రిపబ్లిక్ శాసనసభ ప్రకటించింది

—అబడాన్ యంత్రాగారాలను మూసివేసి బ్రిటిష్ ఉద్యోగులను తరలించడానికి కార్యక్రమం ఏర్పాటయినట్లు టెహరన్‌లోని బ్రిటిష్ రాయబార కార్యాలయోద్యోగి జార్జి మిడిల్టన్ ప్రకటించాడు

—కాశ్మీర్‌పై పాకిస్తానీల దాడులను గురించి భారత ప్రభుత్వం భద్రత మండలికి ఫిర్యాదు చేసింది

—కాశ్మీర్ మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం కరాచీనుంచి ఢిల్లీ వచ్చారు

—ఈసంవత్సరం అక్టోబర్ మొదలు డిసెంబర్ వరకూ భారతదేశంలో ఎన్నికలు జరపడానికి నిర్ణయమయింది అన్ని రాష్ట్రాలూ తమకు వీలైన తేదీలను తెలియపరిచాయి

—ఆంధ్ర ప్రజాపార్టీకార్యవర్గం విజయవాడలో సమావేశమై ఈపార్టీని అఖిల భారత కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీకి రాష్ట్రసంస్థగా మార్చివేస్తూ తీర్మానించారు రంగాగారు తీర్మానంతో ఏకీభవించలేదు.

## మంగళవారం, జూలై 3:

—కొరియా యుద్ధవిరామ సమాలోచనల నిమిత్తం కైసాంగ్‌లో సమావేశానికి జనరల్ రిడ్జివే సమ్మతిస్తూ కమ్యూనిస్టు సేనాధిపతులకు వర్తమానం పంపాడు.

—థాయిలాండ్ నౌకాబల విప్లవం సందర్భంలో నౌకాధిపతి, ఇతర ఉద్యోగులు కొందరు బర్తరఫ్ చెయ్యబడ్డారు

—పశ్చిమ యూరప్ రాజ్యాలన్నీ సమాఖ్యగాచేరి దేశీయ సమస్యలను పరిష్కరించుకోవాలని జనరల్ ఐసెన్‌హోవర్ సూచించారు

—పశ్చిమ జర్మనీతో అమెరికా రాయబార వ్యవహారాలను స్థాపించుకుంది

—కాశ్మీర్ మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం భారత విదేశాంగ శాఖ కార్యదర్శి బాజ్‌పాయ్‌ని కలుసుకుని మాట్లాడారు

—తెలంగాణా కాంగ్రెస్ సేవకుల సమావేశం శ్రీ జమలాపురం కేశవరావు గారి అధ్యక్షతకింద హైదరాబాద్‌లో జరిగింది

## బుధవారం, జూలై 4.

—జూలై 8వ తేదీని కొరియాయుద్ధ విరామ సమాలోచనల నిమిత్తం ఆరంభ చర్చలను కైసాంగ్‌లో జరపాలని కమ్యూనిస్టు సేనాధిపతులు జనరల్ రిడ్జివేకి వర్తమానం పంపారు

—ఆయిల్ టాంకర్ రసీదుల్ని గురించి ఒకరాజీపద్ధతిని పర్షియన్ ప్రధాని డా॥ ముసాదిక్ సూచించాడు

—ఉత్తర పర్షియాలో 1932లో రష్యాకు ఇవ్వబడిన కన్సెషన్ పార్లమెంట్ ఆమోదం పొందనందువల్ల ఇంక అది చెల్లకూడదని పర్షియన్ సెనేట్ తీర్మానం చేసింది

—పర్షియా ఆయిల్ పరిశ్రమలో పని చేస్తున్న బ్రిటిష్ ఉద్యోగులను తరలించే ఉద్దేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వం మానుకుం[illegible]

—పన్నెండేళ్లలో ప్రపంచంలో నిరక్షరాస్యత నిర్మూ[illegible] నిమిత్తం రెండు కోట్ల డాలర్ల కార్యక్రమాన్ని 64 దేశాల ఐక్యరాజ్యసమితి విద్యా, సాంస్కృతిక విజ్ఞాన సంస్థ ఆమోదించింది

(4-వ పేజీ చూడండి)

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 41

అందరూ వెళ్ళినతరవాత ఆల్బర్ట్ తన నివాసాన్ని మాంట్ క్రిస్టోకి చూపించాడు పడకగదిలో గోడపై వేలాడగట్ట బడిన పట మొకటి మాంట్ క్రిస్టో దృష్టి నాకర్షించింది పటాన్ని సమీపించి మాంట్ క్రిస్టో శ్రద్ధగా పరిశీలించాడు అది పల్లెవాసుల దుస్తులను ధరించిన పాతికేళ్ళ యువతి ప్రతిరూపం గదిలో వెలు గంతగా లేదు మాంట్ క్రిస్టోముఖం వివర్ణమైనట్లుగాని, అతను నిట్టూర్పు విడిచినట్లుగాని ఆల్బర్ట్ గమనించలేదు అంతటా నిశ్శబ్దం ఆవరించింది మాంట్ క్రిస్టో ఏకాగ్ర దృష్టితో ఆ యువతిచిత్ర పటాన్ని చూస్తూనే ఇలా అన్నాడు: "ఆల్బర్ట్! ఎంత చక్కని యువతి! దుస్తులుకూడా ఆమెఅందానికి సరితూగుతున్నాయి సుమా! ఆమె చల్లని ప్రేమను పొందే భాగ్యం మీదేనా?"

"కౌంట్! ఈ దుస్తులలో ఉన్నందువల్ల కాబోలు మీ రామెను చూసి పొరబడుతున్నారు ఆమె నా తల్లి, ఈ దుస్తులంటే ఆమెకు చాల ప్రీతి అయిదారేళ్ల కిందట ఈ చిత్రం వ్రాయించింది ఆమె చిన్నతనంలో ఇలాగే ఉండేది కాబోలని నేను ఊహించుకొంటాను ఈ చిత్రం వ్రాయించి నా తండ్రికి చూపి సంతోషపెట్టా లనుకుంది మా అమ్మ కాని ఆయన దీన్ని చూడగానే చికాకుపడ్డారు సహించలేకపోయారు మా అమ్మ ఆశ్చర్యపడింది తరవాత ఆయన చూపు కందకుండా తీసేసి నాకు బహుమతిగా ఇచ్చేసింది నా తండ్రిగారి చిత్రపటం కూడా మరొకచోట ఉంది, అదికూడా చూపుతాను నేను మా కుటుంబ విషయాలు చెప్పి మిమ్మల్ని విసిగిస్తున్నాను కాబోలు అయితే నా తండ్రిగారిని చూసినప్పుడు ఈ చిత్రంప్రసక్తి తేవడం మంచిదికాదని ముందే తెలియచెయ్యడం మంచి దనుకున్నాను నా తల్లి ఈ చిత్రాన్ని చూసినప్పుడల్లా కళ్లనీళ్లు పెట్టుకుంటుంది ఎందుకో నా కింతవరకూ తెలియలేదు నా తల్లికీ తండ్రికీ మధ్య ఈ ఒక్క విషయంలో, అప్పుడొక్కసారి తప్ప, తరవాత ఎన్నడూ వైమనస్యం అనేది ఎరగరు పెళ్లి జరిగినప్పు డెంత అన్యోన్యంగా ఉంటారో ఇప్పుడూ అలాగే ఉంటారు"

మాంట్ క్రిస్టో ఆల్బర్ట్ముఖాన్ని పరిశీలించాడు అతని మాటల్లో అంతరార్థమేదైనా ఉందా అని వెతుకుతున్నట్లు చూశాడు కాని ఆల్బర్ట్ నేత్రాలలో అమాయకత్వం తప్ప మరొకటి గోచరించలేదు ఆల్బర్ట్ ఇలా అన్నాడు "మీకు నా నివాసమంతా చూపించాను ఇంక ఇక్కడ నిస్సంకోచంగా మీరు మసలవచ్చును ఇది మీ స్వంత నివాసమేనని భావించండి ఇంక మనం మాతండ్రిగారి నివాసానికి వెడదాం రోమ్ నగరంలో మీరు నాకు చేసిన సహాయాన్నిగురించి అప్పుడే ఆయనకి లేఖ ద్వారా తెలియపరిచాను నా తల్లీ తండ్రీకూడా స్వయంగా మిమ్మల్ని దర్శించి కృతజ్ఞత తెలుపుకోవాలని కోరుతున్నారు కృతజ్ఞత ప్రకటించడం, ప్రశంసించడం, ఇటువంటివంటే మీకు నచ్చదని నాకు తెలుసును సంసారవిషయాల్ని మీ రంతగా పరిగణించరని కూడా నాకు తెలుసును అయినప్పటికీ పారిస్ సమాజంతో మీకు పరిచయం చెయ్యడం నాతల్లి తండ్రులతో ప్రారంభించాననుకోండి పారిస్ సమాజజీవితంలో సత్కారాలు, పరిచయాలు, పరస్పరాతిథ్య స్వీకారాలే ముఖ్యం"

మాంట్ క్రిస్టో జవాబుచెప్పకుండానే అంగీకారం సూచించాడు ఉత్సాహం కాని నిరుత్సాహం కాని వ్యక్తపరచలేదు ఇటువంటి ఆచారాలు కర్తవ్యమాత్రమనుకున్నాడు ఆల్బర్ట్ పరిచారకుని పిలిచి తల్లికీ తండ్రికీ కబురు పంపాడు తరవాత ఆల్బర్ట్, మాంట్ క్రిస్టో కలిసి కౌంట్ మార్సెర్ఫ్ నివాసానికి వెళ్లారు

ముందు వరండాలో గోడపైన ఆయుధాలు, వంశచిహ్నాలు కనపడ్డాయి ఆల్బర్ట్ చెప్పాడు "ఈ చిహ్నాల్నిబట్టి తెలుసుకోవచ్చును నా తండ్రి ఫ్రెంచివంశానికి చెందినవాడే నా తల్లి పూర్వీకులు స్పానిష్జాతికి చెందినవారు" పెద్ద సావడిలో గోడకొక చిత్రపటం ఉంది అది నలభైఅయిదు, నలభై ఎనిమిదేళ్ళ సైనికాధికారి ప్రతిరూపం లీజన్ ఆఫ్ ఆనర్ పతకం, కోటుపైన రెండువైపులా మరి రెండు పతకాలూ ఉన్నాయి ఈ పతకాలను బట్టి ఈ సైనికాధికారి గ్రీస్, స్పెయిన్ దేశాలలో ఫ్రెంచిసైన్యాలను నడిపినవాడని తెలుస్తుంది

మాంట్ క్రిస్టో ఈ పటాన్నికూడా అతిశ్రద్ధగా పరిశీలించాడు ఇంతలోనే వెనక తలుపు తెరుచుకొని కౌంట్ మార్సెర్ఫ్ (ఫెర్నాండో) వచ్చాడు వయస్సు నలభై, నలభైఅయిదేళ్లుండవచ్చును కాని ఏభై యేళ్లు నిండినట్లు కనపడతాడు మార్సెర్ఫ్ సైనికోద్యోగుల దుస్తులు ధరించలేదు మామూలు దుస్తులపైనే పతకాలు పెట్టుకుని వచ్చాడు కనుబొమ్మలూ మీసాలూ ఎంత నల్లగా ఉంటాయో, తల అంత తెల్లగా నెరిసిపోయింది అడుగులు కొల్చుకుంటూ వచ్చినట్లు వచ్చి ఠీవిగా నిలబడ్డాడు మాంట్ క్రిస్టో అతన్ని తదేకంగా చూస్తూ నిలబడిపోయాడు ఆల్బర్ట్ ఇలా అన్నాడు "వీరే మా తండ్రిగారు నాన్నా! వీరు కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో వీరే నన్ను రక్షించినవారు"

మార్సెర్ఫ్ చిరునవ్వుతో అభివాదంచేశాడు. "నిజంగా మీరు మా వంశాన్ని నిలబెట్టారు మాకు ఏకైక పుత్రుడు ఆల్బర్ట్ ఆల్బర్ట్ని రక్షించిన ఉపకారానికి మిమ్మల్ని మేము ఆజన్మాంతం మరిచిపోలేము"

అనువాదం సీతారామ్

మార్సెర్ఫ్ చూపిన ఆసనంలో మాంట్ క్రిస్టో ఆసీనుడైనాడు అక్కడ కొద్ది తెరచాటు నీడ పడుతోంది ఆ నీడలో నించి అతను మార్సెర్ఫ్ పాలిపోయిన ముఖాన్ని పరిశీలిస్తున్నాడు. ఆ ముఖంలో అనేక కష్టాల ననుభవించిన భావం స్పష్టమౌతున్నది "ఇప్పుడే నా భార్య వస్తుంది మీకు స్వయంగా కృతజ్ఞత ప్రకటించాలని ఆత్రుతతో ఉంది"

"నేను పారిస్ నగరం వచ్చిన మొదటిరోజునే మీవంటి ఉన్నత పురుషుని దర్శించేభాగ్యం లభించడం నా అదృష్టం" అన్నాడు మాంట్ క్రిస్టో "మీ కీర్తి విన్నాను మీరు చాల అదృష్టవంతులు స్పెయిన్, గ్రీస్, మొతాకోదేశాలేవీ మీ సేవ కిప్పుడు నోచుకోలేదా?"

మార్సెర్ఫ్ ముఖం కొద్దిగా ఎర్రబడింది "నేను ఉద్యోగం విడిచిపెట్టేశానండి మహారాజు తిరిగివచ్చినప్పుడు ఉన్నతపదవి నిచ్చారు ఆ మహారాజే ఇంకా ఉంటే నే నింకెంత ఉన్నతి పొందేవాడినో తెలియదు ఈలోగా జూలై విప్లవం సంభవించింది దేశసేవ చేసినందుకు ఎవరికి కృతజ్ఞత? అందువల్ల నేను రాజీనామా నిచ్చాను యుద్ధాలలో జయంపొందడం, రాజకీయాలలో అధికారుల మన్నన పొందడం ఒకటి కాదు అంగువల్ల కత్తిని మూలపడేసి రాజకీయాల్లోకి దిగాను పరిశ్రమల అభివృద్ధికి పాటుపడుతున్నాను లలితకళల్లో కృషిచేస్తున్నాను ఉద్యోగం చేసిన ఇరవైఏళ్లలోనూ కోరుకున్నది ఇప్పుడు లభ్యమయింది"

"ఫ్రెంచి జాతీయులకు ఇటువంటి ఉన్నతాశయాలుండడం వల్లనే ఫ్రెంచిదేశం మిగతా దేశాలకంటె గొప్పదనిపించుకుంది ఉన్నతవంశంలో పుట్టారు భాగ్య సంపదలకు లోటులేదు అయినా సిపాయిగా చేరి మీ అంతట మీరు మీ ప్రజ్ఞవల్లనే వృద్ధిలోకి వచ్చారు ఇది సామాన్యమైన విషయం కాదు సైనికోద్యోగంలో ఉత్కృష్టపదవిని అందుకుని, ఇప్పుడది విడిచిపెట్టి మరొక రంగంలో ప్రవేశించారు తోటి మానవులకోసం సేవ చేస్తున్నారు ఇంతకంటె మానవుడు చెయ్యదగిన దేముంది? ఇటలీలో మా పరిస్థితి ఇలా ఉండదుకదా! జాతినిబట్టి స్థాయినిబట్టి అన్నీ నడిచిపోవలసిందే ఎవరే వృత్తిలో ఉంటే ఆ వృత్తిలో నిత్యం అదే స్థితిలో జీవితమంతా వెళ్లబుచ్చుకుంటారు నిరర్థకమైన జీవితాలు మావి"

"కాని మీవంట విశేష ప్రతిభావంతులకు ఇటలీ తగిన ప్రదేశం కాదు ఫ్రాన్సుదేశం మిమ్మల్ని ప్రీతిపూర్వకంగా ఆహ్వానిస్తుంది మీరు తప్పకుండా స్వీకరించండి ఫ్రెంచిదేశం కృతఘ్నత నెరగదు దేశీయుల్ని సరిగా మన్నించకపోయినా, విదేశీయుల్ని సత్కరిస్తుంది"

ఆల్బర్ట్ అన్నాడు "నాన్నా!" మాంట్ క్రిస్టోసంగతి మీకు తెలియదు ఆయనకి గౌరవ సత్కారాలంటే నచ్చవు ఉన్నదే చాలునంటారు"

"నన్ను సరిగ్గా అర్థం చేసుకున్నారు మీరు" అన్నాడు మాంట్ క్రిస్టో ఆల్బర్ట్‌తో

మార్సెర్ఫ్ ఇలా అన్నాడు "మీ రదృష్టవంతులు మీరు కోరుకున్న వృత్తిలో ఉన్నారు అందులోనే కీర్తి తెచ్చుకున్నారు"

మాంట్ క్రిస్టో సమాధాన మివ్వలేదు చిరునవ్వు నవ్వాడు.

మార్సెర్ఫ్‌కి మాంట్ క్రిస్టోపట్ల సదభిప్రాయం ఏర్పడింది స్నేహభావంతో ఇలా అన్నాడు "మీకు విసుగనిపించకపోతే, మిమ్మల్ని శాసనసభకి తీసుకువెళతాను ఇప్పుడు వస్తారా?"

"తప్పకుండా మరొకసారి వస్తాను" అన్నాడు మాంట్ క్రిస్టో "ఇప్పుడు ఆల్బర్ట్ తల్లిని దర్శించాలని అభిలాషతో ఉన్నాను ఆమెకోసం వేచి ఉండగలను"

"ఇదుగో మా అమ్మ వచ్చారు" అన్నాడు ఆల్బర్ట్ వెంటనే మాంట్ క్రిస్టో తల తిప్పి చూశాడు ఆమె పక్కగుమ్మంవద్దకు వచ్చి నిలబడింది ముఖం బొత్తిగా పాలిపోయింది ఒక చేతిలో ద్వారబంధం పట్టుకు నిలబడి నిశ్చలంగా చూస్తున్నది మాంట్ క్రిస్టో తల తిప్పి చూడగానే ద్వారబంధం పట్టుకున్న చెయ్యి జారిపోయింది ఆమె వచ్చినట్లు ముందు ఎవరూ గమనించలేదు మాంట్ క్రిస్టో చెప్పిన ఆఖరు మాటలు ఆమె విన్నది మాంట్ క్రిస్టో లేచి గౌరవపురస్సరంగా అభివాదం చేశాడు ఆమె శిరస్సువంచి ప్రత్యభివాదం చేసింది కాని ఒక్కమాట మాట్లాడలేదు

ఆల్బర్ట్ ఆమెను సమీపించి, "అమ్మా! ఏమలా ఉన్నావు? ఆరోగ్యం సరిగా లేదా?" అన్నాడు

"లేదు" అంది కౌంటెస్ మార్సెర్ఫ్ (మర్సిడా) "నిన్ను రక్షించినవారిని చూడగానే కొద్ది ఆరాటం కలిగింది అంతే ఆయన నిన్ను రక్షించిఉండకపోతే మా గతేమయ్యేది?" మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఆమె సావడి మధ్యకు వచ్చింది మాంట్ క్రిస్టోతో ఇలా అంది "కౌంట్! నా కొడుకు ప్రాణాలు మీవల్ల నిలిచాయి మిమ్మల్ని ఆశీర్వదించవలసిందని భగవంతుని ప్రార్థిస్తున్నాను"

మాంట్ క్రిస్టో శిరస్సు వంచుకున్నాడు అతని ముఖం మరింత పాలిపోయింది "నేను చేసినది అత్యల్పం అయినా మీ ముగ్గురి కృతజ్ఞతాభావంతో ఉక్కిరిబిక్కిరౌతున్నాను ఒక మానవుని రక్షించడం, ఒక తల్లికీ, తండ్రికీ పుత్రవియోగ బాధను నివారించడం దయాశీలంకాదు అది మానవధర్మం"

"నిజంగా మీవంటి మిత్రుడు లభించడం ఆల్బర్ట్ అదృష్టం" అన్నది మర్సిడా మర్సిడా ఆకాశంవంక నన్నట్లు శిరస్సెత్తి ఊర్ధ్వదృష్టితో చూసి భగవంతునిపట్ల కృతజ్ఞతాభావం ప్రకటించింది ఆమె చక్కని కన్నులలో నీరు నిండినట్లు మాంట్ క్రిస్టో చూశాడు

కౌంట్ మార్సెర్ఫ్ ఆమెను సమీపించి అన్నాడు "నాకు శాసనసభకు పోవలసిన పనుంది అది ఆయనతో చెప్పి క్షమించమని కోరాను సభ రెండుగంటలకి ప్రారంభం అప్పుడే మూడయింది నే నింక వెళ్లాలి ఉపన్యాసం ఇవ్వాలి"

"అయితే మీరు వెళ్లండి వీరిని నేను సత్కరిస్తాను" అంది మర్సిడా మాంట్ క్రిస్టో వంక తిరిగి "ఈరోజుమా ఆతిథ్యం స్వీకరించాలి మీరు" అంది

"నాపట్ల మీదయ అపారం మీ ఆదరానికి కృతజ్ఞుణ్ని. కాని నే నీ నగరానికి రావడమే తిన్నగా బగ్గీలో వచ్చేశాను ఈ నగరంలో నాకే నివాసం ఏర్పాటయిందో ఇంకా నేను చూసుకోవాలి మీ ఆహ్వానాన్ని నిరాకరించలేను కాని ఈ పూట నా చిక్కు మీరు గమనిస్తే చాలు"

"అయితే మరొకసారి రండి తప్పకుండా రాగలరని వాగ్దాన మిస్తారా?" మాంట్ క్రిస్టో జవాబు చెప్పడానికి బదులు

శిరసావహిస్తున్నట్లు శిరఃకంపన చేశాడు "మీకు తొందరగా ఉంటే నేను కాదనను" అంది మర్సిదా

ఆల్బర్ట్ ఇలా అన్నాడు "కౌంట్! రోమ్ నగరంలో నాకు చేసిన సహాయానికి ప్రతిఫలంగా ప్రస్తుతానికి నా నివాసాన్ని మీ ఉపయోగానికి విడిచిపెడతాను"

"అవసరం ఉండదనుకుంటాను బర్టుక్సియో ఈపాటికి అంతా ఏర్పాటుచేసిఉంటాడు ఇప్పుడు నాకోసం బగ్గీకూడా ఇక్కడికి పంపిఉంటాడు."

మాంట్ క్రిస్టో ఏర్పాట్లసంగతి ఆల్బర్ట్‌కి చక్కగా తెలుసు అయినా బర్టుక్సియో ఎంతవరకూ ఆజ్ఞలు పాలించాడో స్వయంగా చూడాలని ఆల్బర్ట్ ద్వారంవద్దకు వెళ్లాడు అక్కడ బగ్గీ సిద్ధంగా ఉంది మాంట్ క్రిస్టో ఇలా అన్నాడు "ఆల్బర్ట్! ఇవాళ ఇంకా నా నివాసంలో ఏర్పాట్లన్నీ పూర్తికావు రేపటికి పూర్తి కావచ్చు అందువల్ల మిమ్మల్ని రేపు ఆహ్వానిస్తాను"

"రోజు వ్యవధి తీసుకున్నారంటే, మామూలు ఇల్లు కాదు, పెద్ద భవనమే మీరు తయారుచేయించగలరు"

"భేష్! ఈమాట అందరితోనూ చెప్పండి ఆల్బర్ట్! ఆడవాళ్లలో నాకు పరపతి వస్తుంది అన్నాడు మాంట్ క్రిస్టో

బగ్గీలో కూర్చున్నతరవాత మాంట్ క్రిస్టో తలెత్తి చూశాడు మేడపైన ఒక కిటికీలో పట్టు తెరలు కదిలినట్లు కనపడింది

ఆల్బర్ట్ తిరిగి తల్లివద్దకు వెళ్లేసరికి ఆమె కళ్లుమూసుకుని పడకకుర్చీలో పడుకుని విశ్రాంతి తీసుకుంటోంది పల్చని తెర ముఖంపైన కప్పుకుంది

ఆల్బర్ట్ ఆందోళనతో అన్నాడు "అమ్మా! మీ ఆరోగ్యం సరిగా లేదా?"

"లేదు లేదు నాయనా! ఈ అత్తర్లు నాకంతగా పడవు సూ ఎక్కువయింది"

"అయితే ఇవి తీసెయ్యమని చెప్తాను అసలు మీరు వచ్చేటప్పుడే చూశాను బొత్తిగా పాలిపోయింది మీముఖం"

పరిచారకుని పిలిచి అత్తర్లు పూలగుత్తులు తీసివేయించాడు ఆల్బర్ట్

తరవాత మర్సిదా ఇలా అంది "ఆల్బర్ట్! ఈ మాంట్ క్రిస్టో పేరేమిటి? వంశనామమా? లేక పదవిపేరా? ఎస్టేటుపేరా?"

"అదొక బిరుదనుకుంటాను టస్కన్ ద్వీపసమూహంలో ఒక ద్వీపాన్ని కొన్నాడు ఇంతేగాని రాజవంశానికి చెందినవాడని ఎప్పుడూ చెప్పుకోడు అయినా రోమ్ నగరంలో ఈయనకి విశేషప్రతిభావంతుడని పేరుంది"

"ఆదర మర్యాదలు చక్కగా తెలిసినవాడు"

"నిజంగా ఈయనకి తెలిసినంతా మరెవ్వరికీ తెలియదని నా ఉద్దేశం యూరప్‌లో ఈయన్ని మించినవారెవ్వరూ లేరనుకుంటాను

"ఆల్బర్ట్! నువ్వు మాంట్ క్రిస్టోని ఆయన నివాసంలో చూశావుకద నీకు ప్రపంచంలో అన్ని విషయాలూ తెలుసు అనేక దేశాలు చూశావు అనేకమందితో పరిచయం చేసుకున్నావు నీ వయస్సుకు మించిన తెలివితేటలున్నాయి నేనొకటడుగుతాను సరిగా చెప్పగలవా? ఆల్బర్ట్! నీకు నేను తల్లిని నిన్ను నా ఆంతరంగిక మిత్రునిగా ఎంచుకుని అడుగుతున్నాను సుమా! మాంట్ క్రిస్టో పైకి కనిపిస్తున్నతరహా మనిషేనా నిజంగా? అంటే ఆయన జాతినిగురించి గాని, భాగ్యసంపదల్నిగురించి గాని నే నడగడం లేదు అసలుతత్వం పైకి కనపడుతున్నదేనా? లేక ఇదంతా నటనా? ఏకాంతజీవితంలోకూడా ఇలాగే ఉంటారా?"

"ఏకాంత జీవితమా? అది పూర్తిగా భిన్నంగా ఉంటుంది ఈయన అద్భుత విశేషాలనేకం చూశాను నా అభిప్రాయం చెప్పమంటే స్పష్టంగా చెప్తాను ఆయన బైరన్ మహాకవి నిర్మించిన మహావీరులలో ఒకడని నా ఉద్దేశం ఏదో తెలియని క్లేశం ఆయన జీవితాన్ని విలక్షణంగా తీర్చిదిద్దింది ఈ పురాతనప్రఖ్యాత వంశానికి చెందినవాడో అయుండాలి సకల సౌఖ్యాలనుంచీ, భాగ్యాలనుంచి వెళ్లగొట్టబడి ఉండాలి ఆపైన స్వయం ప్రజ్ఞవల్ల ఈ అపారభాగ్యం ఆర్జించిఉంటాడు"

ఆయన వయస్సెంత ఉంటుంది?" ఈమారు ఆమె అత్యంత కౌతుకంతో ఆల్బర్ట్ వంక చూస్తూ నిరీక్షించింది

"ముప్పైఅయిదు, ముప్పైఆరుండవచ్చు"

"అంత చిన్నవాడా? కాదు వయస్సు ఎక్కువే ఉంటుంది" అంది మర్సిదా, కొంత పరధ్యానంతో

"కాని అది నిజం నాతో మాట్లాడుతున్నప్పుడు ఫలాని సంవత్సరంలో తన వయస్సు ఫలానా అని చెప్తూ వచ్చారు ఆ ప్రకారం ఎన్నిమార్లు చూసినా ఆయన వయస్సు సరిగ్గా ఇంతేనని తేలుతుంది ఎన్నడూ లెక్క తప్పలేదు అయితే కాదమ్మా! ఆయన కళ్లలో కాంతి చూశారా? జుట్టు ఎంత నల్లగా ఉంది! ఎంత పాలిపోయినా ఆ విశాలమైన నుదుటిపైన ముడతలే లేవు ఆయ నింకా యువకుడే ననాలి మంచి తేజస్వికూడా"

"ఈయన నీపట్ల మైత్రి కనపరిచాడా ఆల్బర్ట్?" అని అడిగింది మర్సిదా ఆమెకు శరీరమంతా ఒకసారి గగుర్పొడిచింది

"అలాగే అనుకుంటాను"

"నీకు ఆయనపట్ల అభిమాన ముందా?" ఈమారు ఆమె మాటలు తడబడ్డాయి

"ఆయనంటే నాకు చాల ఇష్టం ఫ్రాంజ్ ఆయన్ని చూసి ఏ భూతమో ననుకుంటున్నాడు కాని, నాకు అటువంటి దేమీ లేదు"

"ఆల్బర్ట్!" అంది మర్సిదా ఈమారు ఆమె ఉద్వేగంతో మాట్లాడుతున్నట్లు స్పష్టంగా వ్యక్తమయింది "నువ్వు కొత్త వ్యక్తులతో పరిచయం చేసుకుంటున్నప్పుడు ఇంతవరకూ నేనే నీకు మంచిచెడ్డలు బోధిస్తూ వచ్చాను ఇప్పుడు నువ్వు పెద్దవాడవైనావు నాకు సలహా ఇవ్వగల సమర్థత, వచ్చింది నీకు అయినా చెప్తున్నాను కొంచెం జాగ్రత్తగా, విచక్షణతో ఉండాలి"

"నిజమే, అయినా ఈయన్నిగురించి సంకోచించవలసిందేదీ నాకు కనపడ్డంలేదు కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో ఎన్నడూ జూదమాడడు ఎప్పుడైనా మిత్రులతో ఉన్నప్పుడు మద్యం కొద్ది చప్పరిస్తాడు కాని ఎన్నడూ త్రాగడు నావద్ద ధనం తీసుకుంటాడని కూడా అనుమానించ నవసరంలేదు ధనానికి ఆయనకి లోటులేదు నన్ను హేళన చెయ్యడానికి తప్ప అడుగవలసినపని ఆయనకు లేదు ఇంక నే నాయన్నిగురించి ఎందుకు జాగ్రత్తగా ఉండాలో బోధపడ్డంలేదు"

"నువ్వు చెప్పింది నిజమే ఆల్బర్ట్ మనోదౌర్బల్యంవల్ల సంకోచాలు కలుగుతాయి అంతే నిన్ను రక్షించిన వ్యక్తిని చూసేసరికి నాకు ఆవేగం కలిగిన మాట నిజమే. నీ తండ్రి ఆయన్నెలా పరిగణించారు ఆల్బర్ట్?"

"అత్యంత ఆదరంతో సత్కరించారు అంతేకాదు మాంట్ క్రిస్టో రెండు మూడుసార్లు చేసిన ప్రశంసకి తండ్రిగారికి ఆనందం కలిగింది కూడా. చిన్నతనంనుంచీ పరిచయమున్నంత చనువుతో ఇద్దరూ చనువుగా మాట్లాడుకున్నారు ఇద్దరికీ మధ్య మంచి స్నేహం ఏర్పడింది తండ్రిగారు శాసనసభకి ఆయన్ని తీసుకువెడతానన్నారుకూడా"

మర్సిడా సమాధాన మివ్వలేదు. ఆమె ఏదో పరధ్యానంలో మునిగిపోయింది మెల్లిగా కన్నులు మూసుకుంది ఆల్బర్ట్ ఆమె వంక ప్రీతిపూర్వకంగా చూస్తూ నిలబడ్డాడు తన తల్లి అద్భుత సౌందర్యవతి అనుకుని గర్వపడ్డాడు ఇంకా ఆమె తారుణ్యం తరగలేదు ఆమె నిద్రపోతున్నదనుకుని, నిశ్శబ్దంగా మడమలెత్తి మెల్లిగా నడిచి వెళ్ళిపోయాడు తనలో ఇలా అనుకున్నాడు "నిజంగా అద్భుత ప్రజ్ఞగలవాడే ఇక్కడ పెద్ద సంచలనం కలిగిస్తాడని మొదటే అనుకున్నాను అప్పుడే ఆయన ప్రభావం స్పష్టంగా కనపడుతోంది అమ్మకూడా ఆయన్ని అతిశ్రద్ధగా గమనిస్తోంది తప్పకుండా గొప్పవాడే"

## 42

మాంట్ క్రిస్టో ఆరు నిమిషాల్లో తన నివాసానికి చేరుకున్నాడు ఒక్కొక్కటి ఇరవైవేల ఫ్రాంకులికి కొన్న తెల్లగుర్రాలు చూసినవారందరికీ దిగ్భ్రమ కలుగచేశాయి అలీ కొన్న ఇల్లు శాంప్ ఎలిషీకి కుడిప్రక్కనే ఉంది ఇంటిముందు మధ్యలో గుబురుగా ఉన్న చెట్లు ఇంటి ముంగిలిభాగం వీధిలోకి కనపడకుండా కమ్ముతున్నాయి ఈ చెట్లకు చుట్టూ రెండుపక్కల దారులున్నాయి అవి ఇంటి గుమ్మంవద్ద రెండు వైపులనుంచీ కలుస్తున్నాయి ఈదారులవెంట బగ్గీలు పోవచ్చును ఈ ద్వారంకాక ఈ ఇంటికి వెనుక పాంగో వీధిలోకి మరొక ద్వారం ఉంది

బగ్గీ వస్తున్నంతలోనే ముంగు ఇనుప కవాటాలు తెరుచుకున్నాయి పారిస్‌లోకూడా మాంట్ క్రిస్టో పరిచారకులు తరుణం తెలిసి చకచక పనిచేస్తున్నారు లోగుమ్మంవద్ద బగ్గీ నిలవగానే పరిచారకుడు అలీ, గుమాస్తా బర్టుక్సియో ఎదురువచ్చారు మాంట్ క్రిస్టో బగ్గీ దిగి బర్టుక్సియోవంక తిరిగి "ఏజంటెక్కడ?" అన్నాడు

"లోపల గదిలో ఉన్నాడండి" అన్నాడు బర్టుక్సియో

"నా పేర్లు, చిరునామా అచ్చు వేయించి కాగులు తెచ్చావా?"

"తెచ్చానండి తమరు చెప్పినట్లు ఒక కాపు బారన్ డాంగ్లర్‌కి పంపించానండి"

"సరే ఇప్పుడెన్ని గంటలయింది?"

"నాలుగు గంటలండి"

మాంట్ క్రిస్టో ముందున్న గదిలోకి వెళ్ళాడు వెనకనే బర్టుక్సియో వెళ్ళాడు

ఏజంటు లేచి నిలబడ్డాడు "నగరానికి సమీపంగా ఉన్న ఇంటిని అమ్మడానికి అధికారంమీకే ఇవ్వబడిందా?"

"చిత్తం"

"క్రయపత్రం సిద్ధంగా ఉందా?"

"ఉందండి"

"ఇవ్వండది అయితే ఈ యిల్లెక్కడుంది?"

తనకు తెలియదన్నట్లు బర్టుక్సియో సంజ్ఞచేశాడు ఏజంటు ఆశ్చర్యపోయాడు "తమరు కొంటున్న ఇల్లు ఎక్కడుందో తమకు తెలియనే తెలియదా?"

"తెలియదు" అన్నాడు మాంట్ క్రిస్టో "ఎలా తెలుస్తుంది? ఇవాళే పారిస్‌నగరం వచ్చాను ఇంతకు ముందెప్పుడూ ఇక్కడికి రాలేదు అసలు ఫ్రెంచిదేశంలో అడుగుపెట్టడానికిదే మొదలు"

"ఓహో! ఇప్పుడు తమరు కొంటున్న ఇల్లు ఆట్వీల్ గ్రామంలో ఉందండి"

ఈమాటలు వినేసరికి బర్టుక్సియోముఖం పాలిపోయింది

"ఆట్వీల్ గ్రామం ఎక్కడ?" అన్నాడు మాంట్ క్రిస్టో

"ఇక్కడికి దగ్గిరేనండి బొలోన్ అరణ్యాలకు మధ్యలో ఉందండి"

"అంత దగ్గిరా?" అన్నాడు మాంట్ క్రిస్టో "కాని అది పల్లెటూరని చెప్పడానికి వీల్లేదే! సరిగ్గా నగరానికి అనుకునే ఉందన్నమాట అంత దగ్గిర్లో ఎందుకు తీసుకున్నావు బర్టుక్సియో?"

"నేనా!" అన్నాడు గుమస్తా అతని ముఖకవళిక చిత్రంగా మారిపోతోంది "ఈ ఇంటిని కొనాలని తమరు నాకు చెప్పలేదాండి? మీరు సరిగ్గా జ్ఞప్తికి తెచ్చుకుంటే"

"అవునవును" అన్నాడు మాంట్ క్రిస్టో "ఇప్పుడు జ్ఞప్తికి వచ్చింది ఒక పత్రికలో ప్రకటనచూసి పల్లెటూరు కదా అని మోజుపడ్డాను"

"ఇప్పుడైనా మించిపోయింది లేదండి" అన్నాడు బర్టుక్సియో తొట్రుపడుతూ "నన్ను చూడమన్నట్లయితే మరొక గ్రామంలో ఎక్కడైనా చూడగలనండి"

"అక్కర్లేదు, ఎలాగూ ఇదంతా పూర్తయింది కాబట్టి కొనేస్తాను"

"మీరు చెప్పిందే బాగుందండి" అన్నాడు ఏజంటు, తన కమిషన్ పోతుందన్న భయంతో "చాల చక్కని గ్రామమండి అది ఇంటికి దగ్గరలోనే చిన్న ఏరు ఒకటుంది పెద్దచెట్లు, తోటలతో కలకలలాడుతూ ఉంటుందండి ఇల్లు సౌకర్యంగా ఉంటుంది లోపల కర్రసామాను బోలెడుంది ఈ రోజుల్లో పురాతన వస్తువులకోసమే అందరూ డబ్బు వెచ్చిస్తున్నారండి"

"అవును అటువంటివి పోగొట్టుకోకూడదు ఏదీ పత్రం ఇవ్వండి" అన్నాడు మాంట్ క్రిస్టో పత్రం తీసుకుని ఒకసారి పరికించి సంతకంచేసి ఇచ్చేశాడు "బర్టుక్సియో! ఈయనకి ఏభై అయిదు వేల ఫ్రాంకు లియ్యి" అన్నాడు

(44-వ పేజీ చూడండి)

**కథానిక:**




తాలినాటి రాత్రిసరిగ్గా నిద్రపట్టనే లేదు ఒక మర్నాటి మధ్యాహ్నంకూడా ఎంత ప్రయత్నించినప్పటికీ నిద్రపట్టకపోడమనేది కొంతవరకూ ఆశ్చర్యాన్నే కలిగించింది ప్రకాశానికి! కళ్లు మాత్రం బాగా మండుతున్నాయ్! ఆవులింతలు విపరీతంగా వస్తున్నాయ్! అయినా నిదరరాలేదు పరుపుమీద ఇటు అటూ దొర్లేడు కళ్లు గట్టిగా మూసేసుకొని, "రామ రామ రామా" అని జపించడం మొదలెట్టేడు ఏకాగ్రచిత్తతకోసం ఊహూఁ! నిద్రవచ్చే సూచనలేమీ కనిపించలేదు కానీ అలా కొంతసేపు పరుపుమీద దొర్లగా దొర్లగా ఏదో మైకం కమ్మినట్లయింది తానేదో వినగలిగినది వినలేనట్టూ చూడగలిగినది చూడలేనట్లూ, మాటాడగలిగింది మాటాడలేనట్లూ 'ఫీల్' అయేడు అదే నిద్రపట్టడానికి మొదటి దశ అని అనుకున్నాడు. ఆ సమయంలో ఏ విషయాలనూ తన మనస్సులోకి జొప్పించకుండా ఉంటే నిద్దర పట్టేస్తుందనుకున్నాడు —

కానీ "బాబుగారూ! ఎవరో మీగురించి వచ్చేరు' అని బంట్రోతు వెంకయ్య గదిలోకి వచ్చి చెప్పేడు

వెంకయ్యమీద చాలా కోపంవచ్చింది ప్రకాశానికి, మంచి బాగా నిద్దరవచ్చే సమయంలో లేపేసినందుకు — "ఎవరొచ్చినా సాయంత్రం రమ్మనమని చెప్పు అని ఇందాకే నీతో చెప్పేనే! బుద్ధిలేక పోతే సరి పొమ్మను సాయంత్రం రమ్మనమని చెప్పు ఇప్పుడు మంచి నిద్రలో ఉన్నారను" అన్నాడు ప్రకాశం అలా పడుకొనే

"చిత్తం బాబయ్యా అలాగే చెప్పినాను లేచేవరకూ గుమ్మంలో నే కూకుంటా నన్నారు" అన్నాడు వెంకయ్య

"ఎవ్రడా వాడు?"

"ఎవడో కాదు బాబయ్యా! 'ఎవరో అమ్మగారు చదువుకున్న మనిషిలాగున్నారు తెల్లగా, చాలా బాగున్నారు లెండి పాపం ఎంచేతో ముఖం వాడిపోయుంది మిమ్మల్ని ఓసారి చూచి మీరనుగ్రహించకపోతే దండం పెట్టేస్తా,ఇంటికేసి మార్చ్పోయి ఏమయినాసరే నేనా "అంతే తనకర్మ" అనుకొని ఎల్లపోతానంటున్నారావిడ! చాలా మంచి మనిషిలాగున్నారు" అన్నాడు వెంకయ్య

"ఏవనొచ్చిందావిడ?" అని లేచి కూర్చొని ఆందోళనతో అడిగేడు ప్రకాశం

"ఏమో నండీ! చెప్పలేదు" అన్నాడు వెంకయ్య

"వెంకయ్యా, ఆమె కొంచెం పొడుగుగా సన్నంగా, తెల్లగా లొత్తలు కలిగిన బుగ్గలతో ఉంది కదూ?"

"చూసినట్టే వర్ణించేరు బాబయ్యా!"

"వెంకయ్యా, ఆమె ఎవరో నాకు తెలిసిపోయింది మరెవరు నాకోసం వచ్చే ఆడది? ఆ "ప్రభే"! చూసు వెంకయ్యా, "బాబుగారికి నిన్నల్లా నిద్దర లేదు తలుపు గడేట్టుకొని పడుకున్నారు సాయంత్రం రండ"ని చెప్పేయి ఆమె వెళ్లిపోయాక నాతో చెప్పు ఓ పదిహేను రోజులు శెలవుపెట్టి ఏ పల్లెటూరయినా వెళిపోతాను అన్నట్లు నా పేరామెకు తెలుసేమిటి? తెలిసినట్లయితే

మెకు కనిపించడం మంచి పనికాదు లోపలకిమాత్రం ఆమెను రానివ్వకు" అని ఎంతో భయాందోళనలతో చెప్పేరు ప్రకాశం

"చిత్తం బాబయ్యా!" అని వెంకయ్య వెళిపోయినతరువాత గదిలో ఘడియ వేసేసి, మంచంమీద పడుక్కున్నాడు ప్రకాశం

అదివరకు పడుతుందేమో అనుకున్న నిద్దర కూడా ఇక పట్టదని ప్రకాశానికి తెలిసినప్పటికీ కళ్లు మూసుకొనే పడుక్కున్నాడు అప్పటలో నిద్రపట్టక పోయినా అతనంతగా విచారించడు కానీ ఆ ప్రభవిషయం మళ్లీ తలుపుకు రావడం చేత అతని హృదయం భయంతో దడదడ కొట్టుకుంది ఏదో బ్రహ్మాండమయిన దెయ్యం తనగుమ్మంలో కాచుకు కూర్చున్నట్లూ, తను బయటకు వెళితే పట్టుకొని పీల్చి పిప్పి చేసేద్దామని అది అనుకుంటున్నట్లూ భ్రమించేడు

రెండేళ్ల క్రిందట ప్రభ! మళ్లీ ఇప్పుడెందుకొచ్చింది? దాంతో ఆనాడే తను సంబంధం త్రెంచేసుకొని, 'ఉమ'ను పెళ్లిచేసుకున్నాడే!—ఏదో దానిమానాన అగుండక మళ్లీ ఇలా దాపరించిందేమిటి? వెంకయ్యగాడితో చెప్పి బయటకు గెంటించేస్తేనో! ఊహూం లాభంలేదు మరింత గోల చేస్తుంది ఊళ్లో వాళ్లంతా మూగుతారు గడచిన విషయాలన్నిటనీ వాళ్లముందు వెళ్ల గ్రక్కుతుంది ఇంతటి మేనేజరు హోదాలోఉన్న తనబ్రతుకంతా హాస్యాల పాలవుతుంది పోనీ కొంతడబ్బు వెంకయ్యగాడిచేత ఇప్పించేసి తగలేస్తేనో? ఊహూం! అది డబ్బుకోసం వచ్చిందా? దానికి కావలసినంతడబ్బు ఉంది మరి? తనను మాడాలనీ, మళ్లీ తన భార్యగా చలామణీ అవుదామనీ వచ్చుంటుంది అబ్బో! అదెక్కడ జిత్తులమారినక్క ఉమనీ తననీ వేరుచేద్దామని దానుద్దేశ్యం, నయం! ఉమ పురిటకోసమని పుట్టింట కెళ్లబట్టిగానీ, అదే ఇక్కడుంటే ఈపాటికి ఓ పెద్ద రణరంగం అయిఉండవలసినదే తన ఇల్లు ఇంతకీ తనిక్కడ ఉన్నట్లు ఆ శని జేవత కెలా తెలిసిందో అని అనుకున్నాడు—

—కానీ, "ప్రభ అలా తనగురించి రావడంలో ఆమెతప్పేమయినా ఉందా?" అనే ప్రశ్న అతనిమనస్సులో మెల్లగా వెక్కిరించింది ఇంతకీ ఆమె పరాయి స్త్రీయా? తను తన స్వహస్తాలతో తాళి కట్టి వివాహమాడిన ప్రభేకదూ అది? ఆమెను వివాహమాడకముందు తనోనాడు రోడ్డుమీద వెళుతూ వెళుతూ ఆకలి బాధచే స్పృహ తప్పి పడిపోతే, తనకు సపర్యలుచేసి ఆదరించిన సహృదయయే కదూ ఆమె?! ఆ ప్రభ అరుణ హస్తాలమధ్యేకదూ తనొకప్పుడు బంధింపబడి మహానందాన్ని పొందేడు? —ఎన్నో వెన్నెలరాత్రుళ్లను ఎంతో ఆనందంతో, కులాసాగా కబుర్లు చెప్పుతూ ఆ ప్రభతో నేకదూ తను గడిపేడు!—మరి అలాంటి ప్రభను, ఈనాడు తను అంత నిర్లక్ష్యభావంతో చూస్తూ, ఆ వీధి గుమ్మంలో ఎవరో కూలిది కూర్చుందనే భావంతో చూస్తే ఆమె ఎంతగా బాధపడుతుంది? ఆమెతో చెప్పకుండా అర్ధరాత్రప్పుడు లేచి ఇంత దూరదేశం వచ్చేసినందుకు ఆమె అప్పట్లో ఎంతగా దుఃఖించి ఉంటుందో! ఇంతకీ ఆమెను విడచి తను వచ్చేయడానికి ఆమె చేసిన నేరమేమిటి మహా?

—తనను ఆదరించింది గౌరవించింది హృదయ పూర్వకంగా ప్రేమించింది తనే సర్వస్వం అని నమ్మింది అందుకా ఆమెను తను విడిచిపెట్టనది?!—ఏం న్యాయం?—ఎంత కృతఘ్నుడు తను?

ఇంతకీ ఆమెచేసిన తప్పేమిటి? ఓ బెంగాలీ యువతి అవడమా ఆమెతప్పు? ఆ జాతిలో మళ్లీ ఓ వేశ్యఅయి ఉండడమా ఆమెతప్పు? వేశ్యకులానికి చెందినంత మాత్రంలో ఆమె శీలంలో దోషం ఉందా? లేదే! మరి ఆమెను విడిచిపెట్టడానికి కారణం?

—లోకులు!! అంటే అంటారు వాళ్ల మాటలు పడలేక ఏ పాపం ఎరగని అమాయకురాలిని విడిచి వచ్చేయడం ఏమంత న్యాయమయినపని? మరి అలా లోకులంటారని మొదట తనకు తెలీదా?! అమాత్రం లోకానికి దడిసే తను, ఆమె నెందుకు వివాహంచేసుకోవాలి? అప్పుడే తన అశక్తతను ఆమెకు తేలియపర్చకూడదూ? అప్పుడే ఆపని చేస్తే ఈ బాధంతా లేకపోయేదే! ఉసూరుమంటూ ప్రభ దుఃఖించకపోయేదే! అదంత తన తప్పుకాక ఆమె తప్పా?

"బెంగాలీసానిని పెళ్లాడేవేమిట్రా?" అన్నారు కొందరు "సానిదానికి నీతీ జాతీ ఏమిటి? అందులోనూ బెంగాలీది!" అన్నారు కొందరు "ఒకజాతికి చెందిన వాడివి కావేమిట్రా" ఇలాంటి వెధవ బుద్ధులు పుట్టేయి?" అని కొందరు సన్నిహితులు చాలా సూటిగా ప్రశ్నించేరు తనని "ఇదివరకు దానికెన్నిమారులు గర్భవిచ్ఛిత్తి అయిందో!" అని ప్రభను దూషించేరు కొందరు "ఏదో వీడితో కొన్నాళ్లు ఉంటుంది ఆతరువాత వీడికంట్లో కారం జల్లి మరొకణ్ని చేరదీస్తుంది సానిదానికి నీతీ జాతీ ఏమిటి?" అన్నారు మరి కొందరు—ఇంకా చాలా రకాలుగా అని లోకులు తన హృదయాన్ని గాయపరచేరు అసలు విషయాన్ని అర్థంచేసుకోలేని లోకం తన హృదయాన్ని గాయపరుస్తే పరుస్తారు! అందుకని, తనను నమ్మి హృదయ పూర్వకంగా, ఆరాధించే ప్రభ హృదయాన్నా తను గాయపరిచి వచ్చేయడం!

ఆ రాత్రి ఎంత భయంకరమయిన రాత్రి! ప్రభ పడుక్కుంది తన ప్రక్కనే! తనను చేతులతో చుట్టబెట్టి నగుముఖంతో పడుక్కుంది మెల్లగా అతి నేర్పుతో దానికి తెలివిరాకుండా చేతులు తనమీంచి తీసేసి, మంచం చప్పుడవకుండా మెల్లగా దిగేడు తనా రాత్రి పాపం ప్రభ ఇంకా నిద్దరపోతూనే ఉంది తను ఏంచేస్తాడో, ఎక్కడికి వెళిపోతాడో అదంతా ఆ అమాయికకేం తెలుసు! ధైర్యంగా నిద్దరపోతున్నది మెల్లగా బయలుదేరేడు తను అతి నేర్పుతో తలుపుతీసి, ఆరోజున తను ఎంత తెలివిగా రైలుస్టేషనుకు పరుగెత్తేడు అన్నట్లు అలా తొందరలో పరుగెడుతున్నప్పుడు పార్కుదగ్గర మంచి గమత్తుగా పడ్డట్టు జ్ఞాపకం మొణుకుమీద దెబ్బ తగిలినట్టు కూడా జ్ఞాపకం వెధవదెబ్బ, తగిలినట్లు తెలుస్తేకదూ?! ఇంక రైలెక్కడంలో కూడా ఎంత తెలివిగా ఎంత నేర్పుతో ఎవ్వరికీ కనిపించకుండా తువ్వాలు తలకు చుట్టేసుకొని ఎక్కేడు తను!

—మెల్లగా ఈదేశానికి చేరుకున్నాడు తను అదృష్టం ఉండబట్టి, బేంక్ మేనేజర్ పని లభించింది దానికితోడు ఉమ కూడా లభించింది ఒక సంవత్సరమయి తను ప్రభని కొంతవరకూ మరచిపోయి కాలక్షేపం చేస్తున్నాడు మళ్లీ ఈనాడు ప్రత్యక్షమయింది ఏం చెయ్యడం?

ఇంట్లోకి చేరదీస్తే, ఉమ ఏమవుతుంది? లోకు లేమంటారు? మళ్లీ ప్రభతోపాటు లేచి ఎటయినా వెళ్లిపోతేనో?! ఊహూం ఉమగతేమవుతుంది ఉమ ఆత్మహత్య చేసుకుంటుందే! లాభం లేదు ప్రభనే పంపించేయాలి ఎలాగ?

గదంతా చీకటయి పోయినట్లయింది మీదినున్న "వెంటిలేటర్" వేపుచూచేడు. ఓ పెద్ద నల్లటి వాన మేఘం హుటాహుటీగా వస్తున్నాది పరాగంకూడా లేచింది

ధైర్యంచేసి మెల్లగా లేచేడు ప్రకాశం గదితలుపుతీసి, "వెంకయ్యా!"అని మెల్లగా పిల్చేడు

వెంకయ్యవచ్చి, "ఏం బాబూ?" అని అడిగేడు

"అదెళిపోయిందా?" అని ప్రకాశం మెల్లగా అడిగేడు

"లేదు బాబూ! ఇంకా ఉన్నారు ఆవిడస్కూలు ఫైనలు దాకా చదువుకున్నారుట మొగుడు చనిపోయారట! తల్లీ పిల్లలూ ఉన్నారు తనే పోషించాలట మన ఆఫీసులో ఏదయినా గుమస్తాపని ఉందేమో అని వచ్చారుట ఆవిడపేరు కామాక్షిట!" అన్నాడు వెంకయ్య

ప్రకాశం గుండెల్లోని దడ తగ్గింది పెద్దగాలి రావడంవల్ల మేఘాలన్నీ చెల్లా చెదరయి మళ్లీ ఆకాశం నిర్మలంగా తయారయింది ఆందోళన అంతా తగ్గింది ఏదో ఊహించ శక్యంకాని ప్రమాదం లోంచి రక్షింపబడినట్లు భావించుకున్నాడు

కానీ కామాక్షిమీద ఓ రకంగా కోపం వచ్చింది మధ్యాహ్నం నిద్రపోనియ్యకుండా, గతించిన విషయాల స్ఫురణకు కారకురాలయి హృదయ భారాన్ని బాధ నూకల్గించినందుకు ఫలితంగా ఆమె ఎంత బ్రతిమాలి కాళ్లమీద పడినప్పటికీ, "ఉద్యోగం లేదు" అని పొమ్మన్నాడు

తీరా ఆమె నిరాశా హృదయంతో, వెళిపోయిన తరువాత ఆలోచించేడు, ప్రకాశం అంతలా కాళ్లమీదపడి బ్రతిమాలినప్పుడు, ఖాళీ ఉన్నప్పటికీ ఉద్యోగం ఇవ్వకపోడం ఏమిన్యాయమయిన పనని! మధ్యాహ్నమల్లా ఆమెవల్ల, తను మనస్సు పాడు చేసుకున్నాడేగానీ, ఆమె తన మనస్సుని పాడుచేసిందా? వెంకయ్యగాడు చెప్పినవెంటనే తను అవతలకెళ్లి చూస్తే, ఇంతగా తను గతించిన విషయాలను స్ఫురణకు తెచ్చుకొని బాధపడక పోయేవాడే! ఇంతకీ తప్పుతనది ఆ అర్థంలేని కోపంతో అనవసరంగా ఖాళీలు లేవని కామాక్షిని తను పొమ్మన్నాడు పాపం ఆ అమాయిక నిరాశా హృదయంతో కృంగి పోయుంటుందనుకున్నాడు ప్రకాశం మళ్ళీ ఆమె తనకు కనిపించదనుకున్నాడు. అయినా ఎందుకయినా మంచిదని—

—"మళ్లీ కామాక్షి కనిపిస్తే తీసుకురా!" అని వెంకయ్యతో చెప్పేడు ప్రకాశం

నిజానికి అదే ప్రభయిఉంటే అప్పటి తన పరిస్థితి ఏ రకంగా ఉంటుందో ఊహించలేని విషయం అయింది ప్రకాశానికి ఇంతకీ ప్రభ ఏమయిఉంటుందో కూడా ఊహించలేకపోయాడు 




ఉదయము షుమారు పదిన్నరగంటలవుతోంది వాతావరణం ప్రశాంతంగా ఉంది ఆ వూరి హైస్కూలులో టీచర్లందరూ తమతమ తరగతులలో కుర్చీలలో ఆసీనులై పాఠాలు చెప్పటం మొదలుపెట్టారు అక్కడక్కడ కొన్ని తరగతులలో ఇంకా ప్రార్థనపద్యాలు వినపడుతున్నాయి హెడ్‌మాస్టరు విద్యార్థులు ఇంకా ఎవరైనా క్లాసులోకి పోకుండా వరండాలలో పచార్లుకొగుతున్నారేమోనని, వరండాలలో ఆమూలనుంచి ఈమూలకి విరుసుగా తిరుగుతున్నాడు చేతిలో పేమ్ బెత్తం పట్టుకొని

శాంత అప్పుడే హైస్కూలు ఆవరణలోకి కాలుపెట్టింది. ఆమెకు ఒక చేతిలో, క్లాసు పుస్తకాలు ఆనాటికి కావలసినవి, ఉన్నాయి అకుపచ్చపరికిణీ, ముబ్బురంగు వోణీ, తెల్ల జాకెటు ఆమె దుస్తులు కాళ్లకు చెప్పులు లేవు వయస్సు పదునాలుగేండ్లలోపు ఉంటుంది చూడటానికి, అందంగా, ముచ్చటగా ఉంటుంది ముఖంలో అమాయకత్వం గోచరిస్తుంటుంది అలా అని ఆమె ముఖంలో మనకు తెలివిలేమి ఎక్కడా కనిపించదు

శాంత బెదురు బెదురుగా అడుగులు వేసుకుంటూ హైస్కూలు బిల్డింగు మెట్లు ఎక్కి, తన క్లాసురూము వేపుకు నడిచింది ఆనాడు తనయింట్లో ఎంత త్వరగా పని తెమిలించుకొని బయట పడదామన్నా, ఆలస్యం అవనేఅయింది తన క్లాసురూముకు వచ్చేటప్పటికి, క్లాసు టీచరు అప్పటికే ఆరోజు పాఠం బోధిస్తున్నాడు

శాంత క్లాసుగుమ్మంవద్దకు వచ్చి, టీచరుకు నమస్కారం చేసింది

క్లాసులో శాంతను చూసేసరికి గుస, గుసలు బయలుదేరినయి. కొంతమంది ఎగతాళిగాను, కొంతమంది అసహ్యంగాను, కొంతమంది విచారంగాను, శాంతవేపు తమ దృక్కులు ప్రసరింపచేశారు శాంత ఈ చూపులు గమనించింది అసలే లోపల ఆలస్యం అయినందుకు బెదురుగావుందేమో, ఈ చూపులకు ఆమె మరీ క్రుంగిపోయింది

టీచరు శాంతనమస్కారం అందుకొని ఆమెను లోపలికి వచ్చి కూర్చోమన్నాడు శాంత తన స్థానంలోకి వచ్చి కూర్చుంది టీచరు పిరియడ్ ఆఖరువరకు పాఠం సాగించి, వెళ్లబోయేముందు శాంతను దగ్గరకు పిలిచి ఇలా చెప్పాడు

"అమ్మాయీ, ఇందాక హెడ్‌మాస్టరు గారు నోటీసు పంపించారు, ఈనెల జీతం కట్టనివాళ్ల పేర్లను కొట్టేశామని, వాళ్లని క్లాసుకు హాజరు కానీయవద్దని దానిలో నీ పేరుకూడా ఉంది పాపం మీ మామయ్య ప్రతినెలా టైముకే జీతం కట్టేవాడే ఈసారి ఎందుకిలా చేశాడో?"

నోటీసువిషయం విని, శాంతముఖం తెల్లబడింది ఆ ముఖంలో కళా, కాంతులు లేవు

"అయితే మాస్టారూ, నే నిప్పుడే ఇంటికి వెళిపోతాను," అని పెగిలీ పెగలని గొంతుతో అంది

"నువ్విప్పుడే ఇంటికి వెళ్లక్కరలేదమ్మాయీ, ఈపూట ఉండి ఒంటిగంటకి యింటికి వెళ్లిపో," అని అన్నాడు క్లాసు టీచరు

క్లాసుటీచరు మధ్యతరగతికుటుంబానికి చెందినవాడు తన బాల్యంలో బాగా బీదరికం అనుభవించిఉండటంవల్ల బీదల కష్టసుఖాలు అతనికి బాగా తెలుసు శాంత క్లాసులోని పిల్లలలో చాలామందికన్న తెలివైనది తన పాఠాలు శ్రద్ధగా చదివేది అందుకే క్లాసుటీచరు అభిమానం సంపాయించింది హెడ్‌మాస్టరు విద్యార్థినిని స్కూలులో హాజరుకావద్దని నోటీసిచ్చిన తర్వాత ఆపూటమాత్రమే క్లాసులోఉండి పొమ్మనటంకన్న, ఇంకేం చెయ్యగలడు?

అతిభారంగా శాంత మిగతాపిరియడ్సులో ముళ్లమీద కూర్చొన్నట్లు కూర్చొని పాఠాలు వింది

ఒంటిగంటకు శాంత విచారహృదయంతో యింటికి వచ్చి పుస్తకాలు ఒకమూల పడేసి చాపమీద ముఖం బోర్లకిలా పెట్టుకొని, పడుకొంది శాంత తల్లిదండ్రులు చిన్నప్పుడే గతించారు అప్పటినుంచీ మేనమామ దగ్గిరికి తీసి పెంచుతున్నాడు ఆయన తన మేనకోడలిని గారాబంతోనే చూస్తాడు కాని శాంత అత్తకు శాంతఅంటే సరిపడదు, శాంత పొడగిట్టదు యింటి చాకిరీఅంతా శాంతచేతే చేయిస్తుంది మేనమామఆదరంతో ఇన్నాళ్లూ శాంత ఎలాగో కాలం గడుపుతూవచ్చింది శాంత అత్త సీతమ్మ మేనమామ రాజారావు

రాజారావుకు పిత్రార్జితం ఏమీ లేదు అతనొక షాహుకారుదగ్గర గుమాస్తాచేస్తూ, నెలకు 40 రూపాయలు తెచ్చుకొంటాడు ఆ నలభైరూపాయలతోనే తన సంసారం అంతా గడవాలి ఈరోజుల్లో ఒక సంసారం గడవాలంటే నెలకు అధమపక్షం వందరూపాయలు అవసరమయితే, రాజారావు నలభైరూపాయలతో తన జీవితయాత్ర ఎట్లా గడపగలడు? శాంతకు జీతం ఎక్కడనుంచి తెచ్చికట్టగలడు?

శాంత యిప్పుడు స్కూలు ఫైనలు చదువుతున్నది మరి రాజారావు శాంతను ఇంతవరకు ఎట్లా చదివించాడనికదూ, మీ సందేహం? శాంతను ఫస్టుఫారంలో హైస్కూలులో చేర్చాడు ఫస్టుఫారం యాన్యువల్ ఎగ్జామినేషన్సులో శాంతకు అన్ని సబ్జక్ట్సులోను ఫస్టుమార్కులు వచ్చినయి రాజారావు అభ్యర్థనమీద ఆమె పేరును గవర్నమెంటు స్కాలరుషిప్పుకోసం రెకమెండు చేశాడు హెడ్‌మాస్టరు శాంత అదృష్టం బాగుంటంవల్లనో, డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ ఆఫీసరుగారి దయవల్లనో, గవర్నమెంటువారు, శాంతకు స్కాలరుషిప్పు యిచ్చారు, నెలకు పదిరూపాయల చొప్పున ఆ స్కాలరుషిప్పుతోనే శాంత చదువు స్కూలుఫైనలుదాకా సాగింది

ఫిఫ్తుఫారంలో ఆఖరి పరీక్షలకి శాంత జబ్బుపడ్డది పరీక్షలకు హాజరుకాలేకపో

యింది అర్ధసంవత్సర పరీక్షలలో ఆమెకు మంచిమార్కులు రావటంచేత, స్కూలువారామెను ఆ యేడుకూడా ప్యాసు చేశారు కాని ఆ దెబ్బతో ఆమె తన స్కాలరుషిప్పును పోగొట్టుకొంది స్కూలుఫైనలు మొదటినుంచీ రాజారావే ఆమెకు ఎలాగో తంటాలుపడి జీతం కట్టున్నాడు అక్టోబరు నెలదాకా ఎలాగో నెట్టుకురాగల్గాడు కాని పాపం అక్టోబరు నెలకు జీతం కట్టలేకపోయినాడు అందుకే శాంతపేరు స్కూలు రిజిష్టరులోనుంచి కొట్టివేశారు

రాజారావు ఎందుకో పనిఉండి ఒంటిగంటకు యింటికి వచ్చాడు చాపమీద పడుకొన్న శాంత అతనికి కన్పడింది కారణం వెంటనే గ్రహించాడు శాంత దగ్గరకు పోయి "శాంతా, ఈ మాత్రానికే యింత యిదవుతావు దేనికి? వారంరోజుల్లో ఎక్కడో అక్కడ డబ్బుతెచ్చి జీతం కడతాను గాని, నీ చదువు ఆపుతానా? పిచ్చిపిల్లా? లే! అన్నం తిని, పాఠాలు చదువుకో" అని బుజ్జగించాడు

శాంతమాత్రం ఎంతసేపని కుమిలి కుమిలి దుఃఖించగలదు? తన మేనమామ ఓదార్పు మాటలకు శాంత శాంతపడి, ఎలాగో అన్నం ఎంగిలిపడి, యింటిపనులు చూసుకోటం మొదలుపెట్టింది లేకపోతే అత్త తనని కుమిలి మింగెయ్యదూ?

ఎలాగో స్కూలుఫైనలు ముగించి సెకండరీగ్రేడు టీచరు ట్రెయినింగు అయి, తన జీవితం గడిపివేద్దాం అనుకొంది శాంత రాజారావుకూడా అదే వుద్దేశ్యంలో ఉన్నాడు ఉద్యోగం చేసుకొంటూవుంటే, తన పెళ్లిసంగతి తనే చూసుకొంటుందిలే అని రాజారావు ధైర్యం లేకపోతే ఈ రోజుల్లో చేతిలో కానీ లేకుండా తను మార్కెట్టులో వరపసువును ఎలా కొనగలడు?

తమ హైస్కూలు వార్షికోత్సవం ఆ మరునాడు అతివైభవంగా జరుగుతుందని శాంతకి తెలుసు

ఆ వార్షికోత్సవం రోజున అనేకమయిన ప్రోగ్రాములు ఏర్పాటు చేయబడ్డాయి అంతకుముందే పక్షంరోజుల క్రితంనుంచీ క్రీడారంగాలలోను, వ్యాసరచన, వక్తృత్వము మొదలగు వానిలోను విద్యార్థులలో పోటీలు జరుపబడినయి

దానిలో వ్యాసరచనలోను, వక్తృత్వపోటీలోను శాంత తోడి విద్యార్థినులతో పాటు పాల్గొంది ఆరోజు క్రిందనే ఆపోటీ ఫలితాలు తెలుపబడ్డాయి వ్యాసరచనలోను, వక్తృత్వపోటీలోను, శాంతదే ప్రథమ బహుమానం ప్రతిఫలంగా వెండి పతకము బహూకరింపబడాల్సిఉంది బహుమతులు వార్షికోత్సవంనాటి సాయంకాలము పంచబడును అని విద్యార్థులకు తెలిపారు టీచర్లు

వార్షికోత్సవం రోజున సాయంకాలము శాంతకు తన పేరు రిజిష్టరులోనుంచి కొట్టివెయ్యడంచేత స్కూలుకు పోయి ఉత్సవంలో పాల్గొనడానికి మనస్సు ఒప్పలేదు కాని తన సహాధ్యాయిని జానకి బలవంతము మీద చివరకు వార్షికోత్సవం చూడటానికి, తనకు ఇయ్యబోయే వెండిపతకం తీసుకొండామనే ఉబలాటంతో, తన మేనమామ, అత్త, అనుమతితో, ముస్తాబయి స్కూలుకు హాజరయింది శాంత

సభాకార్యక్రమానికి అధ్యక్షునికి కావలసిన కుర్చీ, బల్లా మొదలయినవి అమర్చారు ఒక బల్లలకూర్పుతో అమర్చిన వేదిక మీద

అధ్యక్షుని సమీపములోనే విద్యార్థినులకు ప్రత్యేకంగా సీట్లు ఏర్పాటు చేశారు ప్రేక్షకులకు, విద్యార్థులకు, దూరంగా వరుసగా బల్లలు వేశారు

జరుగవలసిన సభాకార్యక్రమము ముగిసి, వివిధ పోటీలలో పాల్గొన్న వారికి, బహుమతులు పంచియిచ్చే ఘట్టంవచ్చింది చెప్పటం మరిచాను, సభాధ్యక్షులు

(15-వ పేజీ చూడండి)



కథానిక:

# 'తువ్వాయి'

"పద్మ"

అంభా! అని ఆవు అరిచింది కోడె దూడ కట్టుని తెంపుకుని తల్లి దగ్గరకు ఉరకలు వేసింది రామయ్య కాపూ, పాలికాపూ దగ్గరే ఉన్నారు ప్రతీరోజులాగ పాలికాపు దూడను కట్టడానికి వెళ్ళలేదు ఇద్దరూ ఆవు వైపే చూస్తున్నారు 'నందిని చాలా శ్రమపడుతోందిరా వెంకా!' అన్నాడు రామన్న కాపు

'మాతల్లి మరిడమ్మ తల్లీ సల్లగా దూడల్ని రచ్చించు మాతల్లీ, కోడి పెట్టనిస్తాను' అంటూ మొక్కేడు వెంకన్న

'రాత్రిగ్గాని ప్రసవం కాదురా! వెంకా!' అంటూ ఆవు గంగడోలు నిమురుతూ అన్నాడు రామయ్య నందిని కళ్ళమ్మట, నీళ్లు కారుతున్నాయి రామయ్య కాపు చూడలేకపోయేడు 'నందినీ ఎంతబాధపడుతున్నావమ్మా! 'డాకుటరిని తీసుకురానాండి' అన్నాడు వెంకన్న

'పసువుల డాక్టరుని తీసుకురా వేగం! వెంకన్న పరిగెత్తేడు తూరీగలాగు

తనభార్య కిందటిరోజున నెప్పులు పడుతోంటే 'ఊఁ,' అన్న ప్రతీ మూలుగుకీ తనకేదో బాధ కలిగింది మంత్రసాని వచ్చింది తనకేం తోచక డాక్టరు దగ్గరకు వెళ్ళేడు స్వయంగా డాక్టరు గుమ్మంలో అడుగుపెట్టేడో లేదో, 'మగ పిల్లాడు!' అంది మంత్రసాని సంతోషంతో రామయ్య, ఏడీ అంటూ డాక్టరు మాట మరచి పరిగెత్తేడు పురిటి గదివైపు ఇల్లాలుని చూసేడు గబుక్కుని శిశువుని తీసుకుని ముద్దాడేడు

కోడెదూడ ఆవు దగ్గరకు వెళ్లింది ఆవు తనబాధను మరచి దాని మేను నాకుతోంది 'వెళ్లిన వెంకన్న ఇంకా రాలేదేం చెప్మా!' అనుకుంటున్నాడు మళ్లీ ఆవు అరచి కిందపడుకుంది ఊరికే రొప్పుతోంది ఆ బాధ చూడలేక కళ్లుమూసుకున్నాడు మరుక్షణంలో ఆవుకి దూడ పుట్టింది మాలచ్చిమి దాన్ని తీసి తుడిచి ఆవు ముందర పెట్టింది ఆవు నాకు తోంది మాయాగట్రా శుభ్రం చేసింది 'గిత్త' అంది మాలచ్చి ఇంతలోకి వచ్చేడు వెంకన్న, ఒక్కణ్ణే 'ఒరే దూడ గోళ్లుగిల్లి ఇంత తవుడు పెయ్యరా నందినికి' అన్నాడు రామయ్య కాపిం కక్కడనుంచోకుండా మరిడమ్మ గుడికివెళ్లి తలపాగా నడుముకి చుట్టి రెండుకోడిపిల్లల్ని అక్కడవదిలేసేడు.

## 2

రోజులు దొర్లుతున్న కొద్దీ రామయ్య కాపుకి గౌరవంకూడా పెరుగుతూంది పొలంతోపాటు వెంకన్న పెళ్ళాం పిల్లలు కూడా రామయ్య కాపు ఇంట్లోనే వుంటున్నారు 'పిల్లాడు పుట్టిన వేళావిశేషంరా!' అన్నాడు ఒక జ్యోతిష్కుడు

'అదృష్టం' అంది ఒక మహా ఇల్లాలు ఎవరికి తోచింది వారు అన్నారు రామయ్యకాపు ఇదివరకులాగే జీవితంలో ఏ మార్పూ తీసుకురాకుండా దొర్లిస్తున్నాడు దినాల్ని

'తువ్వాయి!' అన్నాడు కేరింతాలు కొడుతూ లక్ష్మయ్య పాకుతూ తువ్వాయి దగ్గరకు వెళ్ళేడు పడుకున్నదాని చెవులు పట్టుకుని ఆడుతున్నాడు లక్ష్మయ్య 'తువ్వాయి' తొక్కేస్తుంది బాబూ 'అంటూ మాలచ్చిమి తియ్యబోయింది పిల్లాడిని ఏడుస్తూ తువ్వాయి చెవుల్ని పట్టుకున్నాడు 'బాబూ మారెం పెట్టకండి! 'అంటూ వదలించబోతూంది వెంకన్న మాలచ్చిమితో నందిని పిల్లలు పొగరుబోతువు కావులేవె వదిలేయ్!' అన్నాడు వదిలేసింది ఆ రోజునుంచీ నందిని రెండో కొడుకు 'రాము'తో లక్ష్మయ్య ఆడటం మొదలెట్టేడు పాలకోసం తప్పితే తల్లి దగ్గర కిద్దరూ వెళ్ళేవారుకాదు లక్ష్మయ్య నడక నేర్చేడు తప్పటడుగులు వేస్తూ తువ్వాయి మెడని కౌగలించుకునేవాడు తువ్వాయి మీద తలపెట్టి నిద్రపోయేవాడు 'రాము' కూడా లక్ష్మయ్య కనపడకపోతే గింజుకునేది కట్టురాట ఊడిపోయేటంత హంగామా చేసేది.

## 3

'లక్ష్మయ్యని బళ్లో వెయ్యాలిరా వెంకా'

'పంతుల్ని పిలవమంటారేటి' అన్నాడు వెంకన్న

మర్నాడు అక్షరాభ్యాసంతో బడికి వెళ్లటం ప్రారంభంచేసేడు పంతులు బెత్తంతీసి ఒక్కనాడూ ఏ పిల్లనీ కొట్టి ఎరక్కపోవటంవలన పంతులు బడి అన్నా పంతులన్నా ఆ వూళ్లో వాళ్లందరికీ ప్రేమ వేసంకాలంలో ఎండవేళ పంతులు బళ్లో పేకాటలు జోరుగా సాగిస్తారు ఊళ్లో యువకులు కాపులూను పంతులు కలవాలు కదా! అని ఊరుకునేవాడు వాళ్లైనా వాళ్ల మానానివచ్చి ఆడుకుపోయేవారే గాని ఎన్నడూ ఒక సుద్దముక్కైనా ముట్టేవారు కాదు

లక్ష్మయ్య బడికి వెళ్లేటప్పుడు తువ్వాయి కూడావచ్చి లక్ష్మయ్య పక్కనే పడుకుంది నెమరేస్తూ అఆలు తోపాటు తువ్వాయి సంజ్ఞల్ని కూడా నేర్చేడు లక్ష్మయ్య.

## 4

ఆవేళ ఇన్స్పెక్టరు వచ్చేడు అకస్మాత్తుగా తువ్వాయి ఇంతమందీ లేచి నుంచుంటే తనూ నుంచుంది అంతా కూర్చుంటే లక్ష్మయ్య పక్కనే తనూ పడుకుంది

'ఛీ ఛీ ఆవుదూడ లేమిటండీ బళ్లోకి అన్నాడు ఇన్స్పెక్టరు రామ్మూర్తి

'బాబూ' అదేం చెయ్యదు వచ్చి

లక్ష్మయ్య కాపుతో వెళ్ళిపోతుంది

'నాన్సెన్స్!' అంటూ దాన్ని తన్నేడు అంతే లక్ష్మయ్య లేచి పలకతో ఇన్స్పెక్టరు మొఖంమీద కొట్టి ఇంటికి పరిగెత్తుకుంటూ వచ్చేడు తువ్వాయి కూడా లక్ష్మయ్య వెనకాలే గెంతులేస్తూ వచ్చింది కొడుకు పరిగెత్తుకుంటూ రావటాన్ని చూసి తండ్రి గాభరాపడ్డాడు తువ్వాయిమీద జోగు కాలుమచ్చ స్పష్టంగా కనపడుతోంది

## 5

ఆ రాత్రి పెళ్ళున జ్వరం వచ్చింది వళ్ళు సలసలా కాగిపోతోంది లక్ష్మయ్య కు పలవరిస్తున్నాడు 'వెధవ అంత హేం తువ్వాయిని అనుభవిస్తాడు' అన్నాడు

'నాన్నా పంతులి బరికి నేనింక వెళ్ళను నువ్వేమీ అనవు కాదూ' అన్నాడు రామయ్య గుండె నీరైపోయింది

'అనను లేరా లక్ష్మయ్యా' అన్నాడు

మర్నాడు మామూలుగా లక్ష్మయ్య రాకపోటంతో తువ్వాయి గుంజకట్టు తెంపుకుని ఇల్లంతా దొడుతీసింది లక్ష్మయ్య మంచందగ్గరకువచ్చి తలతో లక్ష్మయ్యని తడిమింది

పడుకున్న లక్ష్మయ్య, తువ్వాయి మెడ గబుక్కున కౌగలించుకున్నాడు

పంతులు రామ్మాత్రికి కబురుకట్టి పంపించేరు వాళ్ళింటికి పంతులు రామయ్యతో జరిగిందంతా చెప్పేరు రామయ్య అంత విని

'వాడు దానికన్న ఒకరోజు మళ్ళీ పెద్ద ఇంటికి తువ్వాయంటే అంత ప్రేమేమిటో!' అన్నాడు

'అసలు వాడికి చాలా తెలివితేటలున్నాయి పట్నం పంపి పెద్దచదువు చదివించండి' అన్నాడు పంతులు పై మాటలు వినిపించుకోకుండా

'సరే వెళ్ళొస్తా!' అంటూ పంతులు రామయ్య మాట్లాడకపోవటం చూసి అన్నాడు

'నాన్నా పట్నం వెళ్తావా' అన్నాడు జ్వరం తగ్గినతర్వాత రామయ్య లక్ష్మయ్యను

'ఊహూ!' అన్నాడు 'మరేం చేస్తావురా?'

'తువ్వాయితో ఆడుకుంటాను' అన్నాడు వెంకన్న, 'వ్యవసాయంలోకి బాబుగార్ని పెట్టండి' అన్నాడు

'అంతే చేయాలి మరి తువ్వాయికోసం' అన్నాడు రామయ్య చుట్టనుసి రాల్చుతూ



# బహుమానార్హత

(13-వ పేజీ తరువాయి)

ఆ వూరి సబ్ జడ్జీగారు వారు దయతో విద్యార్థి, విద్యార్థినులకు, బహుమతులు పంచి యివ్వటానికి అనుమతించారు

విద్యార్థినుల స్థానంలో మిగతా విద్యార్థినులతోపాటు, శాంత, జానక కూర్చొన్నారు

గెలుపొందిన విద్యార్థుల పట్టి తీసి హెడ్ మాష్టరు ఒక్కొక్క పేరే బిగ్గరగా చదివి, ఆయా విద్యార్థికి వచ్చిన బహుమతి తీసి సబ్ జడ్జీగారి చేతి కిస్తున్నారు సబ్ జడ్జీ ఆ బహుమతులను విద్యార్థులకు ఇస్తున్నారు గెలుపొందిన విద్యార్థు లొక్కొక్కరే బహుమతులు స్వీకరించి సబ్ జడ్జీకి నమస్కారంచేసి, తమ స్థానాలకు తిరిగి వెళ్ళిపోతున్నారు బహుమతులు పొందినవారి ముఖాల్లో ఆనందం చిందులు తొక్కుతున్నది శాంత తనపేరు ఎప్పుడు వస్తుందా అని ఎధురుచూస్తున్నది

చివరకు శాంతపేరు రానేవచ్చింది హెడ్ మాష్టరు వ్యాసరచనలోను, వక్తృత్వపోటి పరీక్షలలోను ప్రథమ బహుమతి స్కూలు ఫైనలు విద్యార్థిని 'శాంత'కు వచ్చిందని బిగ్గరగా ప్రకటించాడు హెడ్ మాష్టరు తన్ను పిలవబోతున్నాడని శాంత లేవపోయింది ఆ ఉత్సాహంలో కాని వెంటనే హెడ్ మాష్టరు ఇలా అన్నాడు

"శాంత ఈనెల స్కూలుజీతం చెల్లించలేదు కాన, ఆమెపేరు స్కూలు రిజష్టరులోనుంచి కొట్టివేయబడింది స్కూలు విద్యార్థులు కానివారు ఈ వార్షికోత్సవ బహుమతుల కర్హులు కారు కావున 'శాంత'కు రావలసిన వెండిపతకము, వ్యాసరచనలోను, వక్తృత్వపోటీలోను రెండవ స్థానంలో వచ్చిన 'శారద'కు బహూకరింపబడుతుంది శారద ముందుకు వచ్చి బహుమతి తీసుకోవచ్చు"

ఈ మాటలు వినగానే శాంతహృదయం ఆగిపోయినట్లయింది ఆమెకళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినయి వళ్ళు తూలిపడబోయింది కాని ప్రక్కనే ఉన్న జానకి ఆమెను గట్టిగా పట్టుకొనటంచేత శాంత క్రిందపడలేదు శాంత ఇక అక్కడ ఒక్కక్షణం కూడ కూర్చోలేకపోయింది జానకిసహాయంతో మెల్లగా ఇంటికి చేరుకొన్నది

'తనకు ఎంత అవమానం జరిగింది? తను స్కూలుజీతం కట్టకపోతే తను గెల్చుకొన్న బహుమతికి అర్హత కోల్పోయినట్లేనా? ఈ ప్రపంచములో డబ్బే ప్రధానమా? బీద వాళ్ళకు ప్రపంచములో స్థానము లేదా? ఏపని సాధించాలన్నా డబ్బే గీటురాయా? మానవజీవితంలో ఆర్థికమైన ఎత్తు పల్లాలు దేవుడే శాసిస్తున్నాడా? ప్రభుత్వమూ, ప్రజలూ అంటారే? ప్రభుత్వబాధ్యత ఎంత వరకు? అసలు ప్రభుత్వం దేనికి? ప్రజల దగ్గరనుంచి పన్నులు వసూలుచేసి తమ పొట్టలు నింపుకోటానికా? ప్రజలకు తిండీ, గుడ్డా, వుండటానికి యిల్లూ, చదువుకోటానికి ఉచితపాఠశాలలు ఏర్పరచటం ప్రభుత్వ కనీసబాధ్యత కాదా? మాది స్వతంత్ర దేశం, మాది స్వతంత్ర రాజ్యం అంటారే? దేనికీ స్వతంత్రము? చదువుకోటానికి అందరికీ సమాన హక్కు లేదా? చదువుకోటానికే సౌకర్యాలు కల్పించలేని ప్రభుత్వం, ప్రభుత్వం అనిపించుకోటానికి తగుతుందా?'

ఆనాడురాత్రి ఎంత బ్రతిమాలినా శాంత భోజనం చేయలేదు ఆమెహృదయంలోని వేదన మనకెలా తెలుస్తుంది? ఆ పరిస్థితుల్లో ఆమె పడే వ్యథని అక్షరాలద్వారా చెప్పటం కష్టసాధ్యం

ఆ మరునాడు రాజారావు తెల్లవారుజాముున ఎందుకో లేచాడు ప్రక్కనే ఉన్న శాంతమంచము వేపు చూశాడు మంచం శూన్యంగా ఉంది ప్రక్క తలగడ వేపు అంతా తడిసిముద్దయింది రాజారావుకు అనుమానం కలిగి, ఇల్లంత గాలించాడు కాని శాంత ఎక్కడా కనపడలేదు దొడ్లోకి వెళ్ళి చూశాడు

దొడ్లో బావిలో శాంతశవము తేల్తూ ఉండటము రాజారావు కంటపడింది





వేపచెట్టుమీద కాకి గూడుకడుతోంది. రకరకాల పుల్లలేరుకుని, బిగువుగా జాగ్రత్తగా ఆత్మరక్షణకోసం తన సంతానంకోసం తన స్వల్ప వివేకాన్ని వినియోగించి కాకి గూడుకట్టుకుంటోంది.

రామస్వామి ఆలోచనగా అరుగుమీది నులకమంచంమీద కూర్చుని వేపచెట్టుకేసి సవిమర్శగా చూస్తున్నాడు. ఒక్కసారి వెనక్కు తిరిగి తన గుడిసెవైపు దృష్టి నిలిపి, చూసుకున్నాడు. ఒరిగిపోయి, లేచిపోయిన తాటాకులు తలలెత్తుకొని చూస్తున్నాయి. పుచ్చిపోయిన తాటిదూలాలు ఫెళఫెళ విరిగి పోదామనుకుంటుంది. రామస్వామి హృదయం ఒక్కసారి పూర్వజీవితాన్నంతటిని వెనక్కు తిరిగి చూచుకుంది. జరిగిన స్మృతులన్నీ శ్రుతులై తన జీవితవీణమీద విషాదరాగా లాలపింప సాగినై.

* * *

తనూ తన తమ్ముడు వీరనాయుడు చిన్నప్పుడెంత సహోదరత్వంతో మసలుకొనేవాళ్లు? ఎంత ఎడబాయని వాత్సల్యంతో ఏకీకృతమైన బాల్యజీవితాన్ని గడిపేరు? అందరిలాగా కాక, 'తమ్ముడూ' 'అన్నయ్యా' అని నోరారా పిలుచుకుని, తగువులు తమాషాలు లేకుండా తమ చిన్నతనం దొర్లించేరు. అనాటి తమ్ముడే తనతో సహచర్యం వహించినవాడే, కాలం మారిపోతున్న కొలదీ, తానూ మరి, అన్నమీద ఈర్ష్యించి, వాటా పంపకంతో విడిపోయి, అష్టకష్టాలు పడ్డాడు కష్టనష్టములు పెట్టేడు.

తండ్రి గతించి, పది పదిహేను రోజులైనా కాలేదు, అప్పుడే తన వాటాతనకు పంపకం చేయమని పట్టుపట్టాడు. ముందుకు సాగిపోతున్న శకటంలో ఒక ఎద్దు వెనక్కు విజృంభించింది. కలలో కూడా తన తమ్ముడు వేరే వుంటాడనుకోలేదు. కాలచోదితంగా అలా జరిగిపోయింది.

"మన మిలా విడిపోవడం మనకుటుంబానికి వంశానికి తలవంపు. నీకీ విపరీతబుద్ధి ఎలా పుట్టింది? నీకు అంతట నీతోచిందేనా?" అన్న రామస్వామికి వీరనాయుడు జవాబు చెప్పక, అనవసరపు మాటలు మిగలకని పంతంపట్టి పట్టు నెగ్గించుకున్నాడు. ఆవాటా పంపకాలలో రామస్వామికే అన్యాయం జరిగివుంటుంది. వీరనాయుడు ప్రతీవిషయానికి చీటికి మాటికీ, పేచీపెట్టి నెగించుకున్నాడు.

ఇంటిపంపకంలో పెద్దచిక్కే వచ్చిపడింది. ఇల్లు విలువ కట్టి చేసి విలువను రెండు విభాగాలుచేసి కావలసినవాళ్లు అక్కర లేనివాళ్లకి భాగ ధనం ఇచ్చే ఏర్పాటు చేసేరు. వీరనాయుడు చచ్చి తగలడినా నాకా ఇల్లు అక్కరలేదన్నాడు. ఇక రామస్వామి కాయిలు పుచ్చుకోక తప్పందికాదు. అది తన తాతముత్తాతల నాటినుంచీ వస్తున్న యిల్లు. శత శతాబ్దాల నాటి చరిత్ర సర్వం అవలోకించుకుని దీర్ఘంగా తన మూగభాషలోకి అనువదించుకుంది. రామస్వామికి దానిభాష అర్థమయింది. తన చుట్టుప్రక్కల ఎన్ని యిళ్లయినా, చిత్రవిచిత్రంగా నాగరిక లక్షణాలతో మారిపోయాయి గాని అది మారలేదు, తన పురాతత్త్వాన్ని అణుమాత్రం గోల్పోలేదు. ఇదివరకు భీమరాజుగారి యిల్లు తనతో పుట్టిదేగాని అయితే అది యిప్పుడొక నాగరికపు మేడ. తనకు మాత్రం మార్పులేనందుకు రామస్వామి యిల్లు గర్వపడిందిగాని తన తోబుట్టువుకో దీవిగా తుల తూగలేనందుకు సిగ్గుపడింది.

వీరనాయుడు వేరేయింటికి వెంటనే బస మార్చేసేడు. 'పెళ్లయేదాక, నాదగ్గరే

వుంశు అని రామస్వామి అంటే 'నీకూ నాకూ సంబంధం లేదన్నాడు ఇంకేం చెప్పం?

ఆ వేళే రామస్వామి భార్య పుట్టింటి నుంచి దిగింది ఇంట్లో తను తలంచని నిశ్శబ్ద వాతావరణం అనుకోని మార్పులు కనిపించేయి వస్తువులు సగానికి సగం తిరుగుకు పోయివున్నాయి రెండు మంచాలుంటే ఒక మంచం రెండు కుండలుంటే ఒక కుండ ఇలాగే

"ఇదేం ఇల్లంతా ఇలాగుందేం? మంచాలు రెండుండాలి భార్య నారాయణమ్మ ఆశ్చర్యంగా అడిగింది

'ఆఁ! రెండు మంచాలుంటే రెండూ మనవే! వాటా వేసుకున్నావా? తమ్ముడు వాటా ఎగరేసుకుపోయాడు'

నారాయణమ్మ చిన్నబోయింది తను కలలోకూడా ఇలా గనకోలేదు తన మరిది మంచివాడనుకుంది గాని, ఇలాటి పనిచేస్తాడనుకోలేదు

"ఇప్పుడెక్కడుంటున్నాడు? కూడూ కురగాయ ఎక్కడ?

"పోన్లే! ఏదో ఏడుస్తాడు"

నారాయణమ్మకు మరిదిమీద అభిమానం అతనంటే ఆమెకొక విలాసం సంతోషం

"పోతూవుంటే వూరుకున్నారా?'

"ఊరుకోలేగు ఉండమన్నారు

పోయేవాణ్ణి ఎవరాపగలరు? వాడికే మాత్రం అభిమానం ఏడవకపోతే నేనేం చేసేది? పెళ్లి పెటాకులు త్వరలోనే కానిచ్చుకుంటాడు?

"అతనికో వేలువిడిచిన మేనమామ ఉన్నాడుకదూ? ఎల్లనిస్తాడు లెండి

రామస్వామి ఇవతలకొచ్చి ఒకసారి నలువైపులా పరికించాడు సంజరంగులు నింగిలో పొంగిపోతున్నాయి ఒకసారి అలా పొలాల్లోకి పోయివద్దామని బయలేరాడు అతనికి ఏకాంతంలో జాతిజీవితానికి సర్వస్వానికి జీవగఱ్ఱలై ప్రత్యక్షమవున వీర కరుణ రసాలు చిప్పిలుమనే జానపద గేయాలుపాడడం అతని సరదా ఎప్పుడూ ఎక్కని ఎత్తైనకొండ ఎక్కేడు క్రిందికి చూచేటప్పటికి భూమంతా తీగెలతో



చెట్లతో అలుక్కుపోయివుంది నెమ్మదిగా కిందకు దిగుతున్నాడు చరచరా ఏదో పాము పొదల్లోంచి పరుగు పెట్టింది

రామస్వామి ఇల్లు చేరుకునేటప్పటికి చీకటిపడింది వీధిలో కూర్చున్న తాతా రెడ్డి పలకరించాడు "నీవిక్కడే వున్నావేం? పెళ్లికి వెళ్లలేదూ?"

రామస్వామి కిది అర్థంకాలేదు

"మీ తమ్ముడేనోయ్! పెళ్లి, అలాగ చూస్తావేం నిన్ను పిలవలేదేంటి?"

రామస్వామికి ఆశ్చర్యంతోపాటు కోపంకూడా కలిగింది

ఏవో మనస్పర్థల్లో కోపాలుంటేమాత్రం బంధుత్వం మానుకుంటాడూ? ఇదేం మనిషి?

నారాయణమ్మకి సంగతి చెప్పేరు

ఆమె ఆశ్చర్యపడింది

"ఇదేం! మనల్ని పిలవకుండానే?"

"నిన్నూ, నన్నూ పిలవాలని ఎక్కడుంది? వాడి విషయం ఎత్తకు నాదగ్గర"

నారాయణమ్మకు తల కొట్టేసినట్లయింది తన మఱదింత అసమర్థుడు, గుస్వార్థుడూనా? తన అన్నను తనెఱుగడూ?

వీరనాయుడు వేరేయింట్లోనే వుంటూ, రామస్వామి గృహచ్ఛాయలకన్నా రావటంలేదు తన పెళ్లి కెవ్వళ్లనీ పిలవకుండా నలుగుర పోకిరీజట్టుని వెంటపెట్టుకుని మేనమావ ఇంటికెళ్లాడు

మేనమావ అడిగాడు

"ఏరా! మీ అన్నయ్య, వదినా ఏరా?"

"పెళ్లి చేసుకునేది నేనా వాళ్ళా?"

బిరుసుగా సమాధానం చెప్పడంతోనే వూరుకున్నాడు మేనమావ ఇంతలో అత్తగారు వచ్చి, అల్లుడికి దిష్టితీసి, "పెళ్లికళ వచ్చింది నాయనా! ఇదివర కెంత అల్లరిచిల్లరగా వుండేవాడివి," అంది

వీరనాయుడు ముసిముసి నవ్వులు నవ్వుకున్నాడు లోపలి పెళ్లికూతురు సీతాలక్ష్మి చిఱునవ్వులు నవ్వుకుంది పెళ్లి యథావిధిగా జరిగిపోయింది తరువాత కార్యంకూడా జరిగితేనేగాని వల్లగాదన్నాడు వీరనాయుడు మేనమావ ఆలోచనలో పడ్డాడు

"పిల్ల యీడేరి వుంది చేసేయండి ఆలోచిస్తారేం? - అంది భార్య

"వచ్చే యేటికి చేద్దామని"

"అలాగంటే ఎలా? పిల్ల ఇప్పుడతని కవసరం వేరే వుంటున్నాడు ఒంటరిగాడు"

"ఇక్కడుండమందాం"

"ఉండండి మీకు తెలీదు"

"అయితే సరే"

తరువాతి కార్యక్రమంగూడా జరిగిపోయింది కార్యంనాట రాత్రి, ఆకాశమంతా మేఘావృతమై పిడుగులతో పర్జన్యగర్జనలతో భయంకర వాతావరణం సృష్టితమై, కల్లోలం జృంభితమైంది ఆ సమయంలో వీరనాయుడు వెచ్చని కౌగిలిలో సీతలక్ష్మి నిద్రపోతోంది

* * *

తెల్లవారేటప్పటికి రామస్వామి మెల్లిగా లేచి రామనామస్మరణ చేసుకుంటున్నాడు బైరాగి పిచ్చన్నతాత రాములవారి కోవెలలో తత్త్వాలు పాడుతున్నాడు తంబురా మీటుతూ వణకిపోతున్న ముసలి కంఠంలో రాగజీవం నిలుపుకుంటూ తన పండిన జీవితాన్ని సంగ్రహించి, అనుభావికంగా, తత్త్వీకరించి, పాటలు పాడుతాడు తనకు తానే అతను స్వయంగా కవి తిన్నగా రామస్వామి కోవెలలోకి త్రోవతీశాడు అతని కనులలో పాపాల్ని సీతారామలక్ష్మణుల విగ్రహ కాంతిరేఖలు తొలగించాయి అతని హృదయంలో రామలక్ష్మణులకి నమస్కరించారు ఆ రామలక్ష్మణుల దెంత అనుకూల సహోదరత్వం? అటువంటి ఆదర్శం ఏ యుగంలోనూ తిరిగి దొరకదు వారు పురాణపురుషులు తమ జీవితాల్ని మానవాంకితంచేసిన ధన్యజీవులు అందుకే వారిని యుగయుగాల తరబడి మానవులు మరువలేకుండా ఉన్నారు

కోడిపుంజు వేకువ నింకా మేలుకొల్పుతూ 'కృష్ణ ధాతో' అని కూస్తానే వుంది

"తాతా! తత్త్వాలు బాగానే పాడతావుగాని, ఇందాక పాడావు,

"ఇంతేలేరా జగమంతా
ఈర్ష్యలు, ద్వేషాలు, కలహాలు
ఏకోదరుల మధ్య భేదాలు"

అన్న పాట మళ్లీ పాడవ్?"

రామస్వామిని చూచి, చిఱునవ్వు నవ్వుతూ, "మిమ్మల్ని గురించే, అనుకున్నావ్ గదూ పాట! నాకా ఉద్దేశంలేదు, రామస్వామీ! నా కెప్పుడేం తోస్తే అది గానంచేస్తానంతే"

"అంతేలే, తాతా! పాడవు?"

రామస్వామి కన్నులు చెమ్మగిలాయి జాలిగొలిపే రాగంలో తీయగా పాడాడు తాత

నాలుగురోజులు తరువాత వీరనాయుడు క్రొత్తభార్యతో దిగాడు చుట్టుప్రక్కల వాళ్లు అందరూ పరామర్శ చేసేరు నారాయణమ్మ కూడా వచ్చింది రామస్వామి వద్దు వెళ్లొద్దన్నా వచ్చింది

మరది మాటాడలేదు

సీతాలక్ష్మి చిన్నబోయింది

"ఏం చెల్లీ! మమ్మల్ని పిలిస్తే అరిగిపోతావా? నీ పెళ్లికి?"— ఎంతో నాజూకుగా అడిగింది వీరనాయుడు విసవిసలాడేడు

"అడ్డమైనవాళ్లని పిలుచుకెళ్లాలిగానోలు," అన్నాడు మరది

"అటెముటకూ! నీఅన్నయ్య నీకు అడ్డమైనవాడా? నీ వదిన నీకు అడ్డమైందా?"

ఈమాటలు ఎంతో కష్టంతో నొచ్చుకుంటూ అంది ఏవిటీ! వింతధోరణి! ఎంతలో ఎలాగ మారిపోయాడు! ఆనాడు తమతో తఱువిధంగా మసలిన మనిషే? ఈవేళ తిరస్కారభావంతో నిరసించి మాట్లాడుతుంటే? నమ్మలేకపోయింది నారాయణమ్మ రామస్వామి వ్యవసాయపు పనుల్లోపడి ఇంటిపట్టే రావటం మానేసేడు వేళకి అన్నం అందితే తినేవాడు లేకపోతే లేదు సాంతంగా ఆకుమళ్లు గున్ని గింజలు జల్లేడు పొలానికి సత్తువగా పెంట తోలించాడు ప్రతీయేడు ఎకరానికి పది పదిహేను పండేది ఈయేడు ఎక్కువ పండించాలని పట్టుదలతో పనులు చేయించాడు ఎమాత్రం ఏమరక కూలీలతో సరి సమానంగా పనిచేసేడు

తన తమ్ముడు సరిగ్గా పొలంవైపుకి రావటంలేదు అంతా పాలేళ్లమీద పెట్టి తాను తప్పుకున్నాడు అప్పుడప్పుడు షికారుగా వచ్చి పోతుండేవాడు పొలాలమీద శ్రద్ధ తగ్గించి, కొత్త కాపురం కొత్తభార్యమీద భక్తిప్రపత్తులు హెచ్చించాడు

'ఒకరోజున పొలంనుంచి, ఎడ్లు తోలుకొస్తున్నాడు రామస్వామి దారిలో వీరనాయుడు రచ్చచావడిమీద "మావిడికింది సోమరుల"తో వికోవికల కేరింతాలు కొడుతున్నాడు రామస్వామి చావడి సమీపించేటప్పటికి ఒక్కుమ్మడి, పకపకలు వికవికలు హెచ్చిపోయి రామస్వామి గుండెలోతులలోకి ప్రతిధ్వనించుకుపోయి గగ్గోలుపరచినై అతని వంటిమీద తేళ్లు జెఱ్ఱులు ప్రాకినట్లయింది తనుగురించే

నవ్వుకుంటున్నారు తన తమ్ముడే తన్నిలా చేయిస్తున్నాడు ఒక్కసారి కోపం తాపం కలిగాయి తమ్ముడివైపు చూసేడు అతని మెలికమీసంలో చిఱునవ్వు మాయమైంది అతని ముఖం పాలిపోయివుంది కన్నులు తామరపువ్వుల్లా గున్నాయి కళ్లు ఉంగరాలు చుట్టుకు పోతున్నాయి రామస్వామికి అతని ముఖంలో విలక్షణత గోచరించింది

రామస్వామి ఎడ్లు తోలుకొచ్చి పాకలో కట్టేసి పడుకున్నాడు నులకమంచంమీద నింగిలో వెన్నెల జలతారుతీగల్లోంచి, చంద్రుడు మధురహాసం చేస్తున్నాడు భావగర్భితంగా తారకాలోకం గీతాగానం చేస్తున్నై

రామస్వామి హృదయంలో రచ్చ చావడిదగ్గర జరిగిన దుర్ఘటన మెదులుతోనే వుంది అతని మనసుని గాయపరుస్తోనే వుంది

తన తమ్ముడు తననించి విడి నలుగురులో నలుగురిచేతా నవ్విస్తున్నాడా?

* * *

రోజులు, వారాలు, నెలలు గడచి కాలాన్ని ముందుకు నెట్టుకుపోతున్నాయి ఆ కాలవేగంలో జరిగిన సర్వసంగతులు ప్రవాహంలోని చిన్ని చిన్ని అలలవలె ఆవిర్భవిస్తున్నాయి

రామస్వామికుటుంబంలో జీవితంలో చెప్పుకోదగ్గ మార్పులు లేవు ఎటొచ్చీ వీరనాయుడి జీవితం క్రిందు మీదైందని చెప్పుకోవాలి

వీరనాయుడు పొలంమీద తగినంత శ్రద్ధ చూపకపోవడంతోనే పంట అనుకున్నంత రాలలేదు అన్నగారిలో సగంకూడా రాకపోవడంతో పాలికాపులమీద విరుచుకుపడ్డాడు నానా అనరాని మాటలూ అని వాళ్లకీయవలసిన జీతాలు గడువుదలలు ఇవ్వకుండా పిచ్చికోపంతో తరుమగొట్టాడు వాళ్లు అలోపాలోమంటూ పోయి మునసబుతో చెప్పుకుని గోడుబెట్టారు

మునసబు సంగతి విచారించి, వీరనాయుడిని మందలించి, జీతాలు కొలిచేయమని తీర్పు చెప్పాడు వీరనాయుడికి కొలవక తప్పిందిగాదు

రానురాను విలాసాలకు కులాసాలకు లోనై వీరనాయుడు జీవితశకటాన్ని విచ్చలవిడిగా పోనిచ్చి, తాగి తందనాలు తొక్కుతుండేవాడు

జీవితాన్ని పెడత్రోవలకి పోనిచ్చి, పనికిరాని ఆదర్శాలు సృష్టించుకుని పుష్టిగా జీవితాన్ని గడుపుకున్నాననుకోవడం ఎంత పొరపాటో అనుభవించిన అంతానికిగాని తెలీదు

ఒకనాటి అర్ధరాత్రి కటికచీకటి, రామస్వామి ఇంటి చూరులోంచి, అగ్గిపొగలు భగ్గుమంటున్నాయి ఇంట్లో పడుకొనివున్న నారాయణమ్మ ఒక్క ఉదుటన ఈవలికి పడింది ఆర్పే ప్రయత్నాలు జోరుగా సాగేక, అగ్నివాతావరణం చల్లబడింది

నిప్పెలా గంటుకుందంటే, ఎలా గంటుకుంది? ఎవరన్నా ధర్మదాతలు అంటిస్తే అంటుకుంటుంది ఎద్దు 'అంబా' అని అరుస్తే, రామస్వామి పశువులశాలలోకి వెళ్లేడు శాలలో అడుగు పెట్టేటప్పటికి కాలికి మెత్తగా తగిలింది నూనెగుడ్డలచుట్ట! అమ్మో! నోరులేని పశువులశాలకూడా అంటించదలచుకున్నారు! తనవైపు దీనంగా చూస్తున్న ఎద్దు గంగడోలు ఆప్యాయంగా దువ్వేడు రామస్వామి ఈ కర్మకాండ ఏమైనా తన తమ్ముడి ప్రోత్సాహంవల్లనే జరిగిందా?

వీరనాయుడు ఊరితో కాలు దువ్వి కయ్యానికి లేపుతున్నాడు ఉన్నవాళ్లతో లేనివాళ్లతో ఇరుగు పొరుగులతో గడిజేరి, తెలుగు మీరిపోతున్నాడు అనేక ఫిర్యాదులు మీదపడినా లెక్కలేకుండా తిరుగుతున్నాడు

ఇంతకూ రామస్వామినే అంటున్నారు జనం, "ఏమిటోయ్! మీతమ్ముడు మరీ ఇదైపోతున్నాడు ఊళ్ళో మేం బ్రతకక్కరలే! పోతంత ఉన్నాడు ప్రపంచజ్ఞానం అక్కరలే! ఊరిరైతుల ఆడపిల్లల్ని దారిలో నిలబెడుతున్నాడు జాగ్రత్తగా వుండమను. నువ్వన్నా చెప్పి బుద్ధొచ్చేట్టు"

రామస్వామి నోరెత్తలేకపోయాడు ఇంతకూ తన తమ్ముడు తప్పుచేస్తే తననే అంటున్నారు జనం ఇద్దరిమధ్య సహోదరత్వం ఒకటేడిసిందిగా!

ఒకనాటి అర్ధరాత్రి వీరనాయుడు కాపుసారా తెగత్రాగాడు ఎవరు పట్టుకున్నా ఆగని వేగంలో పరుగులు పెడుతున్నాడు పోయి, పోయి, ఒక గుడిసెలో దూరాడు 'చినసూరి' గుడిసె అది తాగి మత్తెక్కిపోయివున్న వీరనాయుడు, 'చినసూరి' మీద పడ్డాడు అది ఆగలేక క్రింద పడిపోయింది ఇంతలో ఈ గొడవ గందరగోళం విని, దాని మొగుడు లేచి, సత్తువకొద్దీ వీరనాయుడి నెత్తిమీద కఱ్ఱదెబ్బ వేసేడు ఆదెబ్బకు నెత్తురుకాలవలు కట్టింది "అమ్మో" అన్నాడు నాయుడు నేలమీద ఒరిగిపోయాడు నాయుణ్ని రోడ్డుమీదకి లాక్కొచ్చి పారేసి, లోపలికి ముడుచుకుపోయారు

"అమ్మో" అన్న ఆక్రందనతో ఊరి దిక్కులు పిక్కటిల్లేయి దగ్గరలోనే ఉన్న రామస్వామి చెవులకు భయంకరంగా తగిలేయి, ఆరుబయట ఉన్న అతనికి, తన సహరక్తసంబంధమైన దీనానాదం క్రింద వినిపించింది త్వరత్వరగా వచ్చి రస్తాపట్టి సమీపానికి వచ్చేడు వీరనాయుడు మైకంలోపడి వున్నాడు మెల్లగా శిరస్సు తడిమేడు చల్లగా రక్తం తాకింది ముఖంలోకి చూచేడు తన తమ్ముడే! ఎంత పని జరిగింది! ఎదురుగుండా చినసూరి ఇల్లు గుటకలు మ్రింగుతోంది ఇక్కడే ఈఘోరం జరిగిందని మూగగా సాక్ష్యమిస్తోంది

ఆలస్యంచేస్తే లాభంలేదని అతనింటికే తీసుకుపోయాడు సీతాలక్ష్మి ఈఘోరానికి భోరుమని ఏడ్చింది ఏడిస్తే లాభమేముంది?

తెల్లవారులు కానుకూర్చుని, ముగ్గురూ చేతులు ముళ్ళుపడేట్టు ఉపచరించారు

తెల్లవారేసరికి నాయుడికి తెలివి వచ్చింది కళ్ళు తేలబడ్డాయి అతని ఎదురుగా అన్నయ్య, వదిన, సీతాలక్ష్మి!

"అన్నయ్యా" అన్నాడు మెల్లిగా ఏనాటికినాటిపిలుపు! సహోదరత్వం పొంగి పొరలుతూ, తను చేసిన అపరాధానికి, క్షమాపణ వేడుకుంటూన్న దివ్యప్రేమ వచస్సు!

ఆ మాటలు అందరి హృదయాల్ని కలంచివేసినై అమృతం చిలికించినై రామస్వామి ఆనందపడ్డ కనులతో చూచేడు

మళ్లీ నాయుడు మూలిగాడు

"వదినా! నిన్ను తూలనాడేను క్షమించు"

"జ్ఞాపకం ఉంచుకోండి "

"నేను బ్రతకను నన్ను జ్ఞాపకం "

నాయుడి చివరిమాటలు ఇవే

తెల్లవారేవేళ దీపంలో నూనె లేక వత్తి కొడిగట్టి గాలికెరటాలలో కలిసిపోయింది

* * *

ఒక్కసారి రామస్వామి స్మృతిపథంలో ఈ సంగతులు అనుక్రమణికగా మనోగోచరమయ్యాయి తనింకా నేయించని యింటికప్పుమీద, ఎండుతాటాకులు గలగలమన్నై

వేపచెట్టుమీద కాకి గూడుకడుతోంది రామస్వామి ఆలోచిస్తున్నాడు ★




"ఇదేం బియ్యో మిల్లాగున్నయ్? కంట్రోలు సాపుకాడ లోవని సూరయిగోరింట తెస్తినంటివికొ, పిల్లా!?" భార్య పద్దాలు తెచ్చిన బియ్యం మిణుకు మిణుకు మంటున్న దీపంవెలుగులో చూస్తూ అడిగాడు వీరాస్వామి

"కొంపలంట తిరుగనేక కాళ్లడిపోయి సివర కొమారాజుకాడ బతిమిలాడి తెచ్చేను నీకొడాపద్ద మాడితేగోని కో జెల్లమార దేటి?—అయేం ఊసులు మావా!" - చిరుకోపం ప్రదర్శిస్తూ తాను తీసుకవచ్చిన బియ్యం కొలచి—

"గోరం! - యిదేం గోరం! - బిల్ల కుడుంనా రూపాయి సేతు తేయించిగోని మూడు తవ్వ లనిచ్చేడు, పెద్ద మారాజు! సోలె డెలి తయాయేటి మావా?" - తెల్లబోయి భర్తముఖంలో చూస్తూ అన్నది పద్దాలు

"నే సూత్తానుండు-" అంటూ కూర్చున్న చోటునుంచి లేచివెళ్లి తను కొలిచిచూశాడు వీరాస్వామి

ఎన్నిసార్లు క్రిందా మీదా తలక్రిందులు పడి చూసినా రెండు తవ్వల సోలెడే వచ్చాయి మేలు రక మేమోనని అనుమానించి దీపం దగ్గరగా వెళ్లి పరీక్షించాడు

బియ్యంనిండుగా వడ్లూ రాళ్లూ రప్పలూ కలిసి నానా పాడుగాను కనిపించేసరికి దహించుకుపోతున్న ఆకలి సంగతి మరచిపోయాడు పద్దాలు అశ్రద్ధతో అల్లాంటి బియ్యం తెచ్చి వుండాలనుకుని—

"యింత కంగాలీ బియ్యోం తేడానికి నీ కల్లుగాని పోనా యేటి పిల్లా?" అంటూ గర్జించాడు

మధ్యాహ్నంనుంచీ తిరిగి తిరిగి కాళ్లా వేళ్లా పడి ప్రాధేయపడి వేడుకుంటే రాత్రి ఎనిమిదింటికి దయ తలచి యిచ్చాడవైనా పెద్ద రైతు సూరయ్య తనంత అవస్థపడి తెచ్చినా భర్త తను పడ్డ శ్రమను గుర్తించక ఆగ్రహిస్తున్నందుకు పద్దాలు కళ్లలో నీళ్లు తిరిగాయి

-"మ రేయింటికాడా లోవు మనోల్లంతా ఆరి కాడే తెచ్చుకుంటున్నారంట మావా -" ఆమె గొంతు నుంచి ఉక్రోషం ధ్వనించింది

"మ రియ్యిల్లా కంట్రోలు బియ్యోంనా గాపడుతాయ్యేమే?" - తిరిగి ఉరుకుతూ ప్రశ్నించాడు

"నా కేటి తెలుత్తాది? -" ముడివడ్డ ముఖంతో సమాధాన మిచ్చింది

"సరుకు సూపెకుండ తేడం తెలుత్తాది కామోలు!" - పళ్లు కొరుకుతూ పిడుగులు కురిపించాడు

"ఏటిరా కేసులాట? - పిల్లదే నేరం సేసిం దిరా?" - అంటూ వీరాస్వామి కేకలు విన్న కులపెద్ద వెంకటేసు ప్రక్క గుడిసెనుంచి లోపలకు వచ్చాడు

"సూడు బాయ్యా! - యీ బియ్యోన్ని సూడు! - యి యిల్లా గున్నాయే టంటె నే నేటి సేసేది - వొంకా పోసీ లేని సక్కటి యెండి రూపా యట్టుగెల్లి సూరయి గోరి మొకాన్నెట్టాను తరుక్కు తరుకూ రాల్లకి రాల్లూ, నూకలు నూకలూ! నీ తస్సడములు సేత్తే నే నేటి సెప్పేది?" - ఉద్వేగంతో బియ్యపు బుట్ట తీసుకు వచ్చి వెంకటేసు కందిచ్చింది పద్దాలు

"ను వ్వేటి సేత్తావ్ బుల్లీ! అయి బాగ సేసి నువ్వన్ని గంజి కాయి ఓరబ్బీ, యీ రాసామీ, కుర్రదాన్ని కూక లెయ్యకు, ఆయ నమ్మో యియే కావలకె అప్పల్నగుడు ఆడి కా యేపారము తెరికే" - అంటూ బుట్ట పద్దాలు చేతి కిచ్చి,

ఎదుటి గుడిసెలోని అప్పల్ని పిలచాడు వెంకటేశు

"సూరయిగోరు పెద్దరయితయినా రేసను కారు డుంది అ దెట్టిపోసు సేస్సి బియ్యె మెట్టి కొత్తా పాతా సందు సూసి మనవాళ్ళోల్ల కయన్నీ మారు బేరం సేత్తాడు" అని చెప్పాడు అప్పలు

"ఆరికి దాన్నెం పంకుతాదిగా, మరి కారు ఏడనుండొచ్చిం"దని ఆశ్చర్యంగా అడిగాడు వీరాస్వామి

"కొత్త గివ్రూ రొచ్చినోడికి నీ కే తెలుక-ఆరి కన్నమా శేటి, దాన్నెమున్న పతి రయితు కాడా కారుడు లున్నయి"- అన్నాడు దారిని పోతూ చుట్ట వెలిగించుకునేందుకు వచ్చిన నారాయుడు

"బులిసామి కార డీమంటె రోన్నాల్లు బొంకుక లరిగేనా పనీ పాటా సేయించుకు సంపి సంపిచ్చాడుగందా, యీరందరి కెల్లా గిచ్చేర్రా కరనంమారాజు?" - కను బొమలు ముడిపెట్టి ప్రశ్నించాడు వెంకటేశు

"మాసెల్లెలు బర తీయారో చ్చాన్నెల్లయినా కారు డిచ్చినోరే కాదు కరనంగోరు" - అన్నాడు అప్పలు

"ఆరి దయ రెక్కాడితే డొక్కాడ్డ ఆరికి ముడుపు సెల్లించటాకి మనకాడేటుందిరా? రయితులు కామ ట్టేదో ముట్టసెప్పి తలకో కారుడూ సంపాయించి మనకా ఏపారం సేత్తున్నోరు మన బాద లిలా గుండయ్ - సాల పొద్దోనట్టుంటి యిం కెల్లి బల్లు మూయాలి యెల్లాను వెంకటేసయ్యా"అంటూ దీర్ఘ నిశ్వాసం వదలి ఆరిపోయిన చుట్ట తిరిగి ముట్టించి నారాయుడు గుమ్మం దాటబోయాడు

"అయితే బలైక్కడికి బుల్లోడా?" - అంటూ యధాలాపంగా ప్రశ్నించాడు వీరాస్వామి

"మా కామందు సూరయిగోరు పాతిక బత్తాల బియ్యాన్ని రామాగంలో బేర మిచ్చేరంట అ యీ రేతిరి తోలుకెల్లప్పెప్పాల" - అని సమాధాన మిచ్చి నారాయుడు వెళ్లిపోయాడు

మిగిలిన ముగ్గురూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు పద్దాలు ఒక్క రూపాయి బియ్యం సంపాదించడానికి తాను పడిన శ్రమనంతా వర్ణించి చెప్పిన మాటలు వీరాస్వామి చెవిలో ధ్వనించాయి ఆమె అంత శ్రమపడి తెచ్చిన పాడు బియ్యం కళ్లలో తిరిగాయి ఉద్రేకంతో వీరాస్వామి రక్తం వుబ్బెత్తుగా పొంగింది మరుక్షణంలో - ఆ దుర్భర పరిస్థితినుంచి విముక్తి పొందేందుకు తను చేయగలిగిం దేదీ తన చేతుల్లో లేదనే భావం పొడసూపే సరికి రక్తం ఒక్కసారిగా చల్లపడినట్టయి

"సూడన్నా యీ గోరం! - మన మీద కూడు నేక సచ్చిపోతుండాం కంటోలు కొట్టాయిన బియ్యమే లో వంటడు పెద్దరయి తెత్తే కొట్టంత కొలిసిపోత్తడు మన లాటోల్లు యే రోజు అర్ద యా రోజు తెచ్చుకో కేటి సేత్తాం? - వున్నోరు కామ ట్టారొక్క పారి కొనేసి యెనకేసుకుంట రది పోతే యేకాడి కో కాడి కి యిక్కడమ్మితే బాగుంటదా, పొరుగూరెల్లమ్మితే బాగుంటదా? - మనవాళ్ళోల్లు సచ్చిపోడమే గాని మరి దారి నేదేటి? - నాకె యెవ్వార మేటి పాలి పోనేదు"-అన్నాడు దిగులుగా

"యేటిరా యీ దురన్నేయం? మనోల్ల కీడ రూపా యిచ్చుగొని రొండు శివ్వల రాల్లమ్మి బియ్యాన్ని పొరుగూరు సేరేత్తున్నాడీ సూరయిగోరు యీ యే వీటిని పొలిమేర దాటిమోకుండ సూత్తె బాగుంటదేమొ?" - హృదయంలో ఏమూలనో అణగారి వున్న అక్కసు వెల్లుబుకుతూంటే వెంకటేసుముఖంలో చూస్తూ అన్నాడు అప్పలు

"మన లాటోల్లేటి మిని కేడుత్తారు! - మింతో లేమంటగో? - పెద్దోల్లని పిలుసుకు రారా ఆలోసిద్దాం యీరాసామీ" అన్నాడు వెంకటేసు అనిర్దిష్ట భావాలతో నలిగిపోతున్న అంతరింద్రియాలను అదుపులో పెట్టుకునేందుకు ప్రయత్నిస్తూ

వీరాస్వామి లేచి వెళ్లాడు కొంత సేపటికి హరిజన పెద్దలూ పిన్నలూ హరిజన వాడ మధ్యగన్న పెద్ద రావిక్రిందకు జేరారు ఏరోజు కారోజు ఆహార పదార్థాలకోసం తాము పడే అవస్థలూ - అగచాట్లూ - ఒకరి కొకరు వెలిబుచ్చుకుని వాపోయారు తా మిన్ని కడగండ్లననుభవిస్తుంటే గ్రామంలో పండిన పంటనీ, రేషను షాపుకు వచ్చిన బియ్యాన్నీ, అధిక లాభవాంఛతో తరలించివేస్తున్నా రనే సరికి సహించలేకపోయారు ఈ తరలింపు నరికట్టగల్గిన మార్గాల నూహించి తర్జన భర్జన చేసి ఏనిర్దిష్టాభిప్రాయానికీ రాలేక సతమతమయి కృంగిపోయి తమ అసమర్థతకు కల్గిన నిరాశతో నిట్టూర్పుల్ని వదలి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు

"కారు డునోడికేగోని పచ్చిగియెట్టినా కొట్టాయిన మరోడి కిడంలోదు మనోల్లలో సాలమందికి కరనంగోరు కారుగు ముక్క గీకిచ్చినోరు కాదు అలాటోల్లంత సాటూ మాటూ రయితులకా ఏదో కాడికి మిని కేగుత్తుండారు యీసరికి పెద్దోరంతదాన్నెనీ, బియ్యెన్నీ బేకు మారకెటుకాడికి గెంటేసినోరు కంటోలు బియ్యె మొచ్చినాదంటె సాలు యీరే కొనేసి మారు యేపారం సేత్తుండారు సేత్తె సేసేరు, అది మన కేంనే అయి వూరు దాటి మోకుం గుంట రోజురోజు సందేల రూపాయి పారేస దేవులాడొచ్చు అంసేత మన మెల్లి సూరయిగోర్ని బల్లు తోలకెల్లొద్దని బతిమి లాడితే ఆరే యింటారు; నేకుంటె బల్లని కరనంగోరికి పట్టిద్దాం తిమ్మె రోదులుద్ది కొందట్రా నాగన్నా?" - కులపెద్దల్లో ఒకడైన అంకాలు అందరి ముఖాలూ చూస్తూ గంభీర స్వరంతో నిశ్శబ్దాన్ని భేదించాడు

'వెసు గ్గుంది నీ యాలోసన! - యింకాగు మాత్తరం సెప్పేదేటి?" -అంకాలు అభిప్రాయంతో తన ఏకీభవాన్ని సూచించాడు మరో కులపెద్ద రాములు

"పదిమందికాడా వొప్పే నాగుం దూసు ఓరి కుర్రోల్లా! మా యెనకమాలుండాల్సిందే, ముందు కెల్లి కీసులాడారంటె మక్కెలిరగమొత్తా మనం నేయం

సెబుదామంటే అంతే కాదంట్రా యెంక టేసూ?" - యింకో కులపెద్ద నాగన్న తన అంగీకారాన్ని తెలియజేశాడు

"యింక సూడ్దు లెగండి" - అంటూ వెంకటేసు లేచి నిలబడ్డాడు

అందరూ ఉత్సాహంతో ఒకేసారి వెంకటేసు ననుసరించారు

## 2

"సూరయిగోరూ! - గిద్దగు గింజలు దొరక్క సత్తున్నాం మాకు పున్నెం కీయొద్దు డబ్బిత్తేనే యీయండి మా మన యిని బల్లు మలపండి" అంటూ బండ్లను సమీపించిన హరిజనులు సూరయ్యను దీనంగా ప్రార్థించారు

సూరయ్య తెల్లబోయాడు కొన్ని క్షణాలకు తెప్పరిల్లి మరుపూటకు గతిలేని పంచములు తనకు నీతులు చెప్పి తన వ్యాపారాని కాటంకం కల్గించే పర్యంతమూ వచ్చారనే విషయాన్ని సహించలేక ఆగ్రహావేశపరవశుడయాడు తీవ్రించాడు తనతో అనవసరశోక్యం కలుగజేసుకుంటున్నందుకు రాబోయే ఫలితాన్ని గురించమని గద్దించాడు భయపెట్టాడు

హరిజనులు చలించలేదు మరింత ప్రాధేయపడ్డారు. సూరయ్య కోపోద్రేకం చెలియలకట్ట దాటింది తనబోటి పెద్దరైతు మాటలకు కానీకి కొరగాని వ్యక్తులు నిర్లక్ష్యం చూపుతున్నారనే ఆవేశంతో ఆపాదమస్తకం కంపించిపోయాడు ఉద్వేగంతో తనచేతనున్న కర్రను బండి ప్రక్కనున్న వ్యక్తిపై విసరాడు ఆ విసురు గురి తప్పి ఎద్దుకు తగిలి ఎద్దు పరుగు తీసింది రెండవ ప్రక్క ఎద్దు దాని ననుసరించింది వెనుకనున్న బండ్లు సూరయ్య బండిని వెన్నంటాయి

"బతిమిలాడినా బల్లాపకుండ తరుముతు న్నోరు సేనదూర మొచ్చేసినయ్ సిడత లూడదియ్యండసె!" - అనే కేక హరిజనుల మధ్య నుంచి వినిపించింది

వీరాస్వామి ఒక్క అదటులో వెళ్లి సూరయ్యబండి కెదురుగా నిలచాడు మరుక్షణంలో - "సంపేడురా!" - అనే వీరాస్వామి అరుపూ - "ఆఁ!" - అనే సూరయ్య కేకా - బండి మీదనుంచి దూకి ఎవరో పరువెత్తుతున్న శబ్దమూ ఒకేసారి ధ్వనించాయి

రెప్పపాటులో హరిజనులు బండ్లను చుటుముట్టారు బండ్లతో లేవారు కొళ్ళ శక్తిని పరీక్షించుకున్నారు జరిగిన సంఘటనేదో తెలియక హరిజనులు నాల్గు వేపులా కలియ దొక్కుకున్నారు బండ్ల ప్రక్కకు వచ్చిన రాములు ఓ ప్రక్కగా ఎవరో పడి వున్నట్టనుమానించి ఆ ప్రదేశం చేరాడు చేరి నిర్మలనీలాకాశంలో ప్రకాశిస్తున్న తారకాకాంతిలో అచేతనుడై పడివున్న వీరాస్వామిని గుర్తించి వాని తల పట్టి లేవదీయబోయాడు చేతికి తడి తగిలినట్టయి క్రిందకు వంగి వీరాస్వామిని పరీక్షగా చూసి వాని అర్ధనగ్నశరీరం తలనుండి కారే రక్తంతో పైకప్పు కప్పుకుని వుండడం గమనించి త్రుళ్ళిపడి - "యీరాసామి బుర్ర సితిగినట్టున్నాది, రకతంరో రయ్యో!" - అంటూ వెర్రి కేక పెట్టాడు

అందరూ నిశ్చేష్టితులై ఎక్కడివా రక్కడ నిలచిపోయారు

దడదడ లాడే హృదయంతో నాగన్న రాములుదగ్గరకు వెళ్లి వీరాస్వామి ముక్కు రంధ్రాల సమీపంలోనూ, గుండె మీదా చేతినుంచి పరీక్షించి కొంత కుదుటపడి - "ఊపిరి పోలేదు బెగి యింటికి సేరేసి సిగురొయ్యండి సూడొద్దు!!" - అని అరిచాడు

నాగన్న కేక స్తంభించి నిలచివున్న హరిజనులను చేతనావస్థకు తీసుకువచ్చింది ఆతృతతో అయిదారుగురు ముందుకు వచ్చి వీరాస్వామిని లేవదీసి సాయంపట్టి ఇంటికి తీసుకువెళ్లారు మిగిలినవారు బియ్యంతో వున్న నాలుగుబండ్లనూ గ్రామంపై పు మరలించారు

బండ్లు కొన్ని గజాలు ముందుకు వెళ్ళాయి ఇంతలో గ్రామకర్ణం వెంకటపతినీ, మరి కొందరు పెద్ద రైతుల్ని వెంట పెట్టుకుని వచ్చిన సూరయ్య బండ్లను సమీపించాడు

వెంకటపతి బండ్ల నాపుజేయించి - "వుండవలసిన బస్తాలన్నీ వున్నాయో గల్లంతయినాయో చూడవోయ్ సూరయ్యా" - అని ఆజ్ఞాపించాడు

"సూసుకోండి బాబయిగోరూ మేమేం దొంగతనం సేటానికి సూల్లేదు సరీగ చూసుకోండి!" - అన్నాడు రూక్షంగా ముందు నిలబడ్డ వెంకటేసు

"అబ్బె! తొరలు!!" అంటూ బండ్ల మీద కెక్కి "మూడు బళ్లమీద మూడార్లు పెద్దనిమిది, నాలుగో బండిమీద ఏడు, మొత్తం యిరవై యయిదు బస్తాలు అంతేనా సూరయ్య మామా?" - అంటూ బండి దిగాడు కూడావచ్చిన రైతు గోపాలస్వామి

"అంతే" క్లుప్తంగా జవా బిచ్చాడు సూరయ్య

"పున్నెని కెత్తుకెల్తే యెదవేసాలు సూకాడ సేవండి బాబయిగోరూ" అన్నాడు నాగన్న

"తుంటరిపని చేసినందుకు కోరు మాకు క్కొచోక సమాధానాలు కూడా ఎందుకురా నాగాయా?" - అని, "బళ్లు మా యింటికి పట్టించండి గోపాలస్వామీ" - అంటూ ఆజ్ఞాపించాడు గ్రామాధికారి

బండ్లు కదిలాయి హరిజనులు వెంకటపతితో తాము సూరయ్యను సమీపించిన ఉద్దేశమూ, ఆ క్షణంవరకూ జరిగిన సంగతులూ యథాతథంగా వర్ణించి ముగించేసరికి గ్రామంలో ప్రవేశించారు

"యిరు పక్షాలు చెప్పేదీ విన్నాను.

(26-వ పేజీ చూడండి)

# సినిమాపరిశ్రమ: కళాస్రష్టలు



సినిమాకూడా కావటానికి పరిశ్రమే అయినా, సినిమా పరిశ్రమకూ తదితర పరిశ్రమలకూ చాలా వ్యత్యాసాలున్నాయి ఉదాహరణకు సినిమా చిత్రాని కుపయోగించే ముడిసరుకు ధరకూ సినిమాచిత్రం ఖరీదుకూ పొంతన ఏమీ లేదు ఇతర వస్తువుల నిర్మాణంలో లోపాలు జరిగితేకూడా సరుకు ఏదో వాడికి అమ్ముడు పోతుంది చెడిపోయిన సినిమాచిత్రం ఏకాడికీ అమ్మడు

ఇంతకన్న ముఖ్యమైన విషయమేమంటే ఇతర పారిశ్రామిక ఉత్పత్తులను అనేక ప్రక్రియలుగా విభజించి, వాటిని చూసే వారిలో ఎక్కువభాగం చదువూ సంధ్యా లేని శ్రామికులుండేటట్టూ, మొత్తం ఉత్పత్తి ఏ ఒకరిద్దరు నిపుణులమీదనో మాత్రమే, ఆధారపడేటట్టూ చూస్తారు అంటే ఇతర పరిశ్రమల్లో "బండపని" జాస్తి సినిమాచిత్ర నిర్మాణంలో నిపుణుల సంఖ్య చాలా హెచ్చు మంచి సినిమా చిత్రం తీయాలంటే కనీసం ఒక గట్టి కథకుడూ, ఒక గట్టి కవీ, ఒక గట్టి కళాకారుడూ, ఒక గట్ట సంగీతవేత్తా, ఒక గట్ట కామెరావాడూ ఉండాలి ఇంకా నాట్యాలు నేర్పేవాళ్ళూ, కత్తిసాములు నేర్పేవాళ్ళూకూడా ఉంటే ఉండనూ వచ్చు వీరందర్నీ మించిన డైరెక్టరుండాలి ఆపైన సమర్థులైన నటులూ, పాటగాళ్ళూ, నాట్యగాళ్ళూ ఉండాలి

ఇంతమంది చేసే పనులలో ఏ ఒకడిదీ "బండపని" అనిపించుకోదు. వీళ్లంతా తాము చేసే పనులలో మనసులు లగ్నంచేసి ఆత్మసంతృప్తి సాధించుకుంటూ పనిచేయాలి అప్పుడే మంచిచిత్రం వెలువడుతుంది ఇంతమంది ఆత్మసంతృప్తితోబాటు చిత్రనిర్మాతకూ, డబ్బు పెట్టేవాడికి కూడా తృప్తికలగాలి—అంటే చిత్రానికి బాగా డబ్బు రావాలి

చిత్రనిర్మాతలు తమ లాభాలే ప్రధానంగా ఎంచుకుని మిగిలినవారి సంతృప్తిని లక్ష్యపెట్టకుండా జనాన్ని రంజింపచేయటానికి చిత్రంలో దొరికీ దొరకని బూతులు నాలుగూ, అతికీ అతకని నీతులు నాలుగూ పెట్టి కొద్ది చిత్రాలు తీయవచ్చు, సఫలులు ద కూడా కావచ్చు కాని అటువంటి ప్రవృత్తులు కాలక్రమాన సినిమాపరిశ్రమకే అపాయం కలిగిస్తాయి

అటువంటప్పుడు ఇంతమంది "నిపుణుల" ఆత్మసంతృప్తి సాధించటం ఎట్లా? అది సాధ్యమవుతుందా? వీళ్లు తమ "కళాస్వాతంత్ర్యాన్ని" ఎంతవరకు కోల్పోవాలి? అటువంటి ప్రశ్నలు కలిగి తీరుతాయి ఇది మన సినిమ పరిశ్రమను ఎదుర్కొంటూ ఉన్న పెద్ద క్లిష్ట సమస్య దీన్నిమాత్రం మన ప్రొడ్యూసర్లు తప్పించుకు తిరుగుతున్నారు ప్రస్తుతం మన చిత్రాలలో కలిగిన అభివృద్ధి కేవలం అనుభవంద్వారా లభ్యమైనదేగాని, నైపుణ్యంద్వారా లభ్యమైనది కాదు నిజంగా నిపుణుడైనవాడు దారి తప్పి ఏ సినిమాశాఖలోకిగాని ప్రవేశిస్తే వాడితో మిగిలినవాళ్లు వేగలేరు వాడు చిత్రనిర్మాణకర్మకాండను తారుమారు చేస్తాడు ఉదాహరణకు సమర్థుడైన కథకుణ్ని తెచ్చి వాడిచేత కథ రాయిస్తే, వాడు రాసిన కథను రాసినట్టు ఆమోదించినప్పటికీ కూడా డైరెక్షనులోగాని, నటనలోగాని వాడు అనుకోని వ్యత్యాసాలు వచ్చి, తను సృష్టించిన సంఘటనలకుగాని పాత్రలకుగాని తభావతు ఏర్పడితే వాడు ఊరుకోడు, ఊరుకోలేడు సంభాషణలో ఒక్కమాట ఉచ్చరించటంలో కొద్ది మార్పు జరిగినందువల్ల పాత్ర ఎంతగా మారిపోయే అవకాశం ఉందో కథకుడికి తెలిసినంతగా డైరెక్టరుకు తెలియకపోవచ్చు—డైరెక్టరుకూడా పాత్రల విషయంలో కథకుడంత సూక్ష్మదృష్టికలవాడైతే తప్ప! అంటే డైరెక్టరు కథకుడంతవాడైనా కావాలని తేలుతున్నది

నిపుణుడైన డైరెక్టరుదృష్టినుంచి కథకుడు కూడా అంతే ఈ కథకుడు సమర్థుడై మంచి సన్నివేశాలూ, పాత్రలూ సృష్టిచేస్తేనే తప్ప తాను దర్శకుడుగా ఏమీ చేయలేడు దర్శకుడూ, కథకుడూ కూడా సమాన నైపుణ్యం కలవాళ్లుగా మాస ఏకుకోవటంకన్న రెండు పనులూ చాతినయిన వాణ్ని పెట్టుకోవటం చాలా సులభం అందుకనే మన సినిమారంగంలో చాలామంది డైరెక్టర్లు తమ కథలను తామే రాసుకోటం జరుగుతూవచ్చింది ఇందులో తప్పేమీ లేదు

కథకుడికీ డైరెక్టరుకూ మధ్యఉండే సంబంధంలాటిదే ప్రొడ్యూసరుకూ, డైరెక్టరుకూ ఉండే సంబంధంకూడా అందుకనే పేరు కెక్కిన డైరెక్టర్లలో చాలామంది తమ చిత్రాలను తామే నిర్మించుకుంటారు

నిజం ఆలోచించినా అంతే మంచి స్క్రీన్‌ప్లే రాయగలవాడు కొంతవరకు డైరెక్టరుపనీ, కొంతవరకు కామెరాపనీ తానే చెయ్యాలి సినిమా చిత్రనిర్మాణంలో పాల్గొనే ప్రతినిపుణుడికీ ఇతర నిపుణుల పని అంతో ఇంతో తెలిసి ఉండాలి అందుకే, నిపుణుల సంఖ్య చిత్రనిర్మాణంలో ఎంత తక్కువగా ఉంటే అంత మంచిది చిత్రనిర్మాతగానూ, నటుడుగానూ జగద్విఖ్యాతి గడించిన చార్లీచాప్లిన్ తన చిత్రాన్ని తానే రాసుకుంటాడు, నిర్మిస్తాడు, డైరెక్టు చేస్తాడు అందులో తానే నటిస్తాడు, దానికి తానే సంగీతం అమరుస్తాడు, వీలయితే తానే ఫోటోగ్రాఫ్ చేస్తాడు కూడాను అందుకనే చార్లీచాప్లిన్ ప్రజలకు ప్రదర్శించే సినిమా కళలో ఏకత్వం, సమగ్రత్వం ఉంటుంది

కళాదృష్టిలో ఉత్తమ చిత్రాలుగా నిర్ణయించి ఎకాడమీ ఎవార్డు లిచ్చినప్పుడు ఒకే చిత్రానికి మూడునాలుగు బహుమతులు రావటంలోకూడా ఇదే అర్థం చిత్రం బాగుండి, ఫోటోగ్రఫీ బాగుండక పోవటమూ, ఫోటోగ్రఫీ బాగుండకుండా దర్శకత్వంమటుకు అద్భుతంగా ఉండ

(30-వ పేజీ చూడండి)



బనారాణి హింది చిత్రంలో యశోధరా కట్జూ

# రామరాజ్యం

(22-వ పేజీ తరువాయి)

మిగతా సంగతి సందర్భాలు నేను చూసుకుంటాను మీ రింక వెళ్ళి దెబ్బ తగిలిన వాడికి మందూ మాకూ చూసుగోండి మీ రింక వెళ్లొచ్చు -" అంటూ వెంకటపతి హరిజనులకు చెప్పిపంపాడు

సూరయ్యా, కూడా వున్న వారూ బండ్లతో వెంకటపతియింటికి చేరారు

## 3

సూరయ్య యిరవై రూపాయల నుంచి మొదలుపెట్టిన బహుమతీ బేరపు సంఖ్య నూటయాభయి వరకూ పెరగడమూ, వెంకటపతి రిపోర్టు వ్రాత ముగించడమూ ఒకే సారి జరిగాయి సూరయ్య నోట్లను లెక్కించి గోపాలస్వామిచేతి కందించాడు

"మీరు ఫిర్యాదు రాసి పంపితే పరువుగా బతికేవాళ్ల అల్లరిపాలవడం తప్ప మీకు మాత్రం కలిసొచ్చే దేముందో సెలవియ్యండి కర్ణంగారూ? - మా సహాయం మీ కుండాలి, మీదీ మా కుండాలి ఈసారి కిల్లా పోనియ్యండి మీ మాట కెప్పుడూ అడ్డు చెప్పకుండా ఎప్పటి కప్పుడు మీ మామూళ్లు మీ కిచ్చేస్తూనే వున్నాం ఏ కర్చు కరామతులకో అడ్డొస్తాయి ఇవిగో - యి వుచ్చుగుని సూరయ్యమామ నొదిలెయ్యండి" - అంటూ గోపాలస్వామి నూటయాభయి రూపాయలు వెంకటపతి చేతిలో పెట్టబోయాడు

"సూరయ్యమీద నాకేం పగ లేదని అతగాడికీ తెలుసు, నిన్నూ కాదననని నువ్వూ యెరుగుదువు డబ్బుకోస మనుకుంటున్నావేమో, వెదవ డబ్బు! - మన్ని డబ్బు గడించిందా, డబ్బును మనం గడించామా! - నాకు డబ్బు లెక్కం కాదు - అం - యింతకీ చెప్పవచ్చిం దేమిటంటే - ఈ మాల మాదిగలకు వాళ్లంతట వాళ్లు బళ్ల నడ్డుకొట్టే తెలివీ, సూరయ్యలాటి మోతుబరిని కాదన గలిగిన గుండెనిబ్బరమూ వున్నట్టయితే యింతకాలంనుంచీ ఒక్క గింజకూడ ఊరు దాటి వెళ్లలేదని మనందరం ఎరుగుదుం కాగా వాళ్లిప్పుడిల్లా ప్రవర్తించారంటే వీళ్ల వెనక నెవరో వుద్దండపిండ ముండి వీళ్ల నిల్లా ఆడించాడని అనుకోక తప్పదు పోనీ నా అభిప్రాయం తప్పని భావించి, వీళ్లంతట వీళ్లే కడుపు కాలి అడ్డగించారనే అనుకుందాం అల్లాంటప్పుడు యింతదూరం సాగించిన వ్యవహారం యింతతో తృప్తిపడి వదులుతా రన్నమాట కల్ల నేను రిపోర్టివ్వకపోయినా వాళ్లే వెళ్లి ఆ పని కాస్తా చేసితీరుతారని నమ్మి తీరాలి అంచేత ఏవిధంగా చూసినా ఈ బియ్యం అధికార్లకు స్వాధీనపరచి తీరాలి తప్పదు" - నోట్లు తీసుకోకుండా ముఖం చిట్లించి, దీర్ఘాలోచనలో నున్నట్టు కనుబొమ లెగురవేసి ఆకాశంలో చూస్తూ, సమాధాన మిచ్చాడు వెంకటపతి

"మీ రిల్లా గంటే మా బోటివాళ్లు బతగటమే కష్టం మరో యాభయి తీసుకొని రక్షించండి" - అంటూ ప్రాధేయపడ్డాడు సూరయ్య

"నే నయితే ఏదో వకటి చెయ్యొచ్చు మునసబు నేం చేస్తావు? - సూరయ్యా! - నే నెంత చెప్పినా నీకు బోధపడడంలేదు వాళ్లు వీరాస్వామి తల పగిలిం దంటున్నారు కూడాను రేపు ప్రొద్దుటే వచ్చి నా మీద పడితే నే నేం చెప్పాలి? వాళ్లూరుకున్నా రామేశం వూరుకోనిస్తా డనుకోను తను మహా నిజాయితీ వున్నవాడల్లే అవినీతనీ, అక్రమ మనీ, వాడి ముఖమనీ నోటికి వచ్చినట్టల్లా వాగుతూ అడ్డమయిన చమురుకాళ్ల సన్యాసినీ వెంటేసుకు వచ్చి పెద్దా చిన్నా భేదంలేకుండా గణాచారిలా మీద పడతాడు పై అధికార్లతో చెప్పి అల్లరి చేస్తానంటాడు సూరయ్యబాబూ! - నువ్వు నమ్ము నమ్మకపో, అసలు వాడే వీళ్లని రేపెట్టి వెనకనుంచి హంగు చేస్తున్నాడని నా నమ్మకం - అన్నట్టు మరిచిపోయాను బాబూ! మొన్న రామేశమూ నువ్వూ కేకలేసుకున్నారని విన్నాను, అదెందుకూ? -" తనకు రామేశంమీద నున్న ద్వేషాన్ని తెలియనివ్వకుండా సూరయ్యకూ రామేశంకూ మధ్య విభేదాలను మరింత వృద్ధిపరచి, యిప్పుడు చేజిక్కిన అవకాశాన్ని వినియోగించుకుని ఆరని అగ్నిహోత్రం చెలరేగేలా చేయాలనే వాంఛతో మాటల్లో తేనెవాకలు ప్రవహింపజేస్తూ సూరయ్యమీద తన కెంతో అభిమాన మున్నట్టు నటించాడు వెంకటపతి

"తన సామ్మెగో పోయినట్టరచుకుంటూ వచ్చాడు మొగం వాచీలా నాలుగూ పెట్టాను అయితేనేం! - ఆ మొగానికి సిగ్గా ఎగ్గా! - అబ్బెబ్బె! - మా బక్కావు పల్లెంకడి చేలో పడిందని పల్లెంకడి కొడుకు కట్టేశాడు మా పాలేర్లొ యిప్పగొచ్చాడు అది తెలిసి పల్లెంకడికి కబురంపి కనుక్కుంటున్నా తనప్పుడింట్లో లేకపోతే వస్రాడు తెలియక కట్టేశాడనీ, జరిగిన తప్పిదానికి కొడుకును మందలించుకుంటాననీ పల్లెంక డంటున్నాడు రామేశంగా రా పక్క నెక్కడో వున్నారేమో దూకెల్ని చేలమీద పడి బతకమని వదలటమూ, ఆ బాధ భరించలేక కట్టేస్తే వాళ్లేదో నేరం చేసినట్టు నిలదీయటమూనా? అంటూ ఏదేదో చదువుతూ చక్కావొచ్చాడు మాడండి వర సెలాగుందో!" - అన్నాడు కోపురించిన ముఖంతో సూరయ్య

"మామా! - వాడివరసే అంత నేను చెప్పలేదూ! - నన్నింక మొగమాట పెట్టొద్దు" - అని వింతభంగిమంలో తల వూపి -

"శ్రీరాములూ! - పని చెబుతున్నా నను కోక ఒక్కసారి వెట్టాడిని పిలిచిపెట్టు మా బాబు నాకు తమ్ముడు వరసలే, అంచేత నువ్వంటే స్వతంత్రం చూడు మరి - పడుచువాడివి ఎంత హుషారుగా వుండాలి!" అంటూ చిరునవ్వుతో స్తంభానికి జేర్లపడి కూర్చున్న యువకు ణ్ణుద్దేశించి చెప్పాడు వెంకటపతి

"ఈ వక్కమాటా విని మీకు తోచింది చెయ్యండి పెద్ద మాదిగలు నలుగురికే కబురంపి వీరాస్వామికి దెబ్బతగిలి నందుకు పాతికో పరకో వాళ్ళ చేతులో పెడితే వాళ్లే నోరుమూసు కూర్చుంటారు సూరయ్యదే తప్పని ఆ కాసేపూ అందాం, నష్టమే మొచ్చింది? - మునసబు కేం తెలుసు నా మొగం! మీ రెట్టమన్నచోట అతగాడికి చేతయిన సంతకం బరుకుతాడు మీ రింక మాటాపెద్దు కానీయండి మరో పాతి కుచ్చుగుని ఫయిసలు చెయ్యండి -" అంటూ రెండువందల యిరవై అయిదు రూపాయలూ వంకటపతి చేతిలో పెట్టాడు గోపాలస్వామి

వత్తిడి భరించలేక యెంతో అయిష్టంగా పుచ్చుకుంటున్నట్టు ముఖం ముడిచి - "మనిషంటే నువ్వే మనిషివోయ్ గోపాలం మామా! - పట్టిన పట్టు నెగ్గించుకున్నావు సూరయ్యా నువ్వు రావడంతోటే అనుకున్నాను కాళ్లు కట్టేసి మీ రెల్లాగూ నా చేత ముంతెడు నీళ్లూ తాగిస్తారని అనుకున్నట్టుగానే జరిగింది — సూరయ్యబాబూ! నీకు తెలవదు యిల్లాంటి వ్యవహారాలంటే సామాన్యం కాదు, కొంప లంటుకుంటాయి నువ్వు కావలసినవాడవడంచేత వూరుకోవలసివచ్చిందేకాని నువ్విచ్చేడబ్బు చూసికాదు మరో డయితే వేలిచ్చినా యింత మహోపకారం చేయను అర్ధరాత్రయినా నువ్వొచ్చి తలుపు తట్టావనే సరికల్లా నీ వెంటపడి వచ్చి వాళ్లని పంపించేశానంటావా లేదా?" - అంటూ తను పుచ్చి

తంగా ఉపకారం చేసినట్టూ, అతనికి ఉపకారం చేసేందుకే తా నక్కగున్నట్టూ యెంతో ఆప్యాయంగా చెప్పి దీపం దగ్గరగా వెళ్లి ఒక్కొక్క నోటూ వెలుగులో విడివిడిగా తీసి గీటిగుర్తులూ, చిరుగులూ, నలుగుడూ, మరకలూ, పరీక్షించి సిరా మరకపడ్డ రూపాయి నోటు వేరు చేసి "ఇల్లాంటివి బస్తీల్లో అయితే చెలామణీ అయిపోతాయి యిక్కడ కోమటి గురవయ్యలాంటివాళ్లు చచ్చినా తీసుగోరు మరోటి మాగు" - అంటూ ఆ నోటు సూరయ్య చేతి కిచ్చాడు

సూరయ్య ఆ నోటు తీసుకుని మరోటిచ్చి "ఈ రోజుల్లో డబ్బిచ్చినా ఎవ రుపకారం చేస్తార్లెండి! ఈ మాలమాదిగల్ని చూడండి, చస్తున్నామంటే లేదనకుండా పావలానో, అర్ధశే బియ్యం పోస్తూనే వున్నా ఎదురు తిరిగారు వీళ్లల్లో విశ్వాస మెక్కడుందో చెప్పండి? దొంగముండావాళ్లు నా కింక సెలవిప్పించండి" - అంటూ సూరయ్య నల్లబడ్డ ముఖంతో లేవబోయాడు

"వాళ్ల వ్యాపారంకూడ ఫయిసలు చెయ్యమన్నాడుగా గోపాలం మామ? - వాళ్ళకు పారేసే దేదో పారేసి వ్యవహారం చక్కపెట్టుకుని వెళ్ళడం మంచిది ఏం మామా, ఏమంటావు?" అన్నాడు వెంకటపతి గోపాలాన్నుద్దేశించి

"మీ యిష్టం" - గోపాలస్వామి ముఖం ముడిచి నెమ్మదిగా జవా బిచ్చాడు

"శ్రీరాములూ! పాపం నీకు పని తప్పిందని సంతోషించాను కాని తప్పలేదు. నువ్వు బుద్ధిమంతుడివి వెళ్లి పెద్దమాదిగల్ని నేను రమ్మన్నానని చెప్పి తీసుకురా పనిలో పని, వట్టివాడిని కూడా వెంటపెట్టుకురావడం మరచిపోకు" - అని వెంకటపతి శ్రీరాములుకు సందేశ మిచ్చాడు.

శ్రీరాము లా సందేశాన్ని శిరసావహించి వెళ్ళి పది పదిహేను నిమిషాల్లో "- వీరాసామి కింత సారా పట్టించి వాళ్ళింత తాగి వొళ్లు తెలియకుండా పడుకున్నారు తమరు రమ్మన్నారంటే తెల్లా రొస్తామని చెప్పారు నే నొచ్చేశా నం"టూ వెట్టివాడితో వచ్చాడు

వెంకటపతి కళ్లు క్రొత్త ఆలోచనలతో మెరిశాయి

"వీళ్లీ మధ్య మరీ మితిమీరిపోయార్లే! తెగ తాగుతున్నారు ఎందు కెందుకని యెప్పటి కప్పుడు వదిలేస్తూవచ్చాను సరేలే సూరయ్యా!-మీ రింక వెళ్లొచ్చు!" అన్నాడు వెంకటపతి అతని కంఠంలో కౌటిల్యం ప్రతిధ్వనించింది

"మీ రిల్లా వాళ్ల వేపు కళ్ళెత్తి చూడక పోడంచేతే వాళ్లంత పేట్రేగారు" - ఉక్రోషంగా అన్నాడు సూరయ్య

"వాళ్లను పోలీసుల కప్పగిస్తే పాయిలో పుల్లముక్కలు వచ్చే మొగమాటం పోవడం తప్ప నా వళ్లో ఏ మెరుగుతుందో చెప్పు" - సూరయ్యముఖంలో రెప్పలసందునుంచి చూస్తూ చిరునవ్వుతో సమాధాన మిచ్చాడు వెంకటపతి అతని చూపులో - నవ్వులో మోసం తొణికిసలాడింది

"మీరు మాదగ్గర మాత్రం గుంజటం లేదూ?" కోపంగా ప్రశ్నించాడు గోపాలస్వామి.

"ఉచితంగా యిస్తున్నట్టు చెబుతా రేమిటి? యిచ్చారో నాచేత పని చేయించుకుంటున్నారో! - యింతకీ - మాటవరసకన్నంత మాత్రంచేతే కోపం రావాలిటోయ్ మామా? - నాకు మాత్రం వాళ్లని పెచ్చు పెరగనివ్వా లనుందీ! - అబ్బెబ్బె! - సమయంకోసమే నేనూ చూస్తున్నా యివ్వాళ సూరయ్యబాబుమీద తిరగబడ్డారు. రేపు మరోడిమీద కలియపడతారు, ఎల్లుండి నాకెదురుతిరుగుతారు మన మేపని చేసినా ఒక్క దెబ్బలో రెండుపక్షులు రాలాలి, సూరయ్యబాబూ! చక్కటి సలహా యిస్తాను నీ కోపిగుంటే ఆ దారిని వెళ్లు వీళ్లరోగం కుదురుతుంది-" అన్నాడు వెంకటపతి ఎంతో నమ్మకం పుట్టిపడుతున్నట్టున్న స్వరంతో. "చిత్తం" అంటూ ఉత్సాహంతో వెంకటపతి ముఖం చూశాడు సూరయ్య

వెంకటపతి సూరయ్యనీ గోపాలస్వామి నీ ప్రక్కగా పిలచి మంతనాలాడాడు కనుబొమ లెగుర వేసి తర్జని వూపుతూ తియ్యటి కబుర్లు చెప్పాడు. 'దీని కింక తిరుగులేద'ని హుందాగా తల ఎగుర వేశాడు వెంకటపతి మధురవాక్కులలో తలమున్కలయిన సూరయ్య తక్షణంలోనే హరిజనులను హతమార్చివేశాడనుకున్నంత పరవశత్వంచెంది తృటిలో వెళ్లి వెంకటపతి చెప్పబోయే సలహాకు ముందుగానే యిచ్చేందు కంగీకరించిన నూటయాభయి రూపాయలు తెచ్చి వెంకటపతి కిచ్చాడు

"నువ్విప్పుడు రామేశాన్ని జాలితలచి వదిలేసినా వా డూరుకుంటాడంటే నేను నమ్మను వాళ్ల వెనకాల వుండి వాడెల్లాగా చక్రం తిప్పక మానడు అంచేత వాణ్ని గూడా పనిలో పని యిప్పుడే తక్కేశా మంటే తర్వాత ఆట్టే శ్రమపడ నక్కర్లేదు యింతకీ నువ్విప్పుడు చేయవలసిందేమిటంటే—రామేశం ప్రొద్దుటే కొందర్ని- వాళ్ల పేర్లు నేను చెబుతాలే—వెంటేసుకుని నీయింటికి వచ్చి, నువ్వు తిండికోసమూ పాలేర్ల జీతంకోసమూ వుంచుకున్న ధాన్యం తాను వెంటపెట్టుకుని వచ్చినవారికి అప్పుగాగాని, ఖరీదుకుగాని యివ్వాలని చెప్పాడనీ, నువ్వా విధంగా చేయలేనని చెప్పడంచేత ఆగ్రహించి విన్నేదో అంటూంటే దారినిపోయేవాళ్లు — ఆ సాక్షులపేర్లు కూడా ఆలోచిద్దాంలే— వచ్చి మందలిస్తే రామేశమూ, అతనికూడా వచ్చినవాళ్లూ వెళ్లిపోయారనీ, ఆతర్వాత రామేశం ప్రోత్సాహంతో ప్రొద్దుటవచ్చిన మనుష్యులు అర్ధరాత్రి వేళ గోడదూకి నీ యింట వసారాలో ప్రవేశించి అక్కడ పేర్చివున్న ధాన్యం బస్తాలను దొడ్డిదారిని బయటకు పట్టుకుపోతూంటే అయినధ్వనికి నువ్వు లేచి బయటకువచ్చి శబ్దం వినిపిస్తున్న వైపుకు బేటరీలైటు వేసి చూశావనీ నువ్వు లైటువెయ్యడంతోటే వీరాస్వామి ఒక్క దూకులో వచ్చి నీమీద కలియబడడంతోటే నీచేతిలో లైటు క్రిందపడిపోయిందనీ— ఆ వేశంతో నువ్వు వాడితో పెనుగులాడి నాదగ్గర వున్న కర్రతో వాడిని కొట్టావనీ, ఈలోపున అప్పులు నీవెనుకనుంచి వచ్చి నిన్ను క్రిందపడత్రోసి నోరు నొక్కాడనీ, కోపావేశంలో వుండడంచేత కేకలు వేద్దామనే ఆలోచనకూడ నీకు కలుగలేదనీ—ఈ స్థితిలో రాములూ వెంకటేశూ వచ్చి నిన్ను స్పృహతప్పేలా కొట్టారనీ—యిదంతా మొదట బేటరీలైటు వెలుగులోనూ ఆతర్వాత నక్షత్రాల కాంతిలోనూ నువ్వు గుర్తుపట్టగలిగావనీ,—నీకు తెలివివచ్చిన తర్వాత లేచి ప్రక్కవాళ్లనూ, యింట్లోవాళ్లనూ పిలచి, వెళ్లి చూడగా అయిదు ధాన్యంబస్తాలు తరిగివున్నాయనీ, ఈసంగతి వెంటనే గ్రామాధికార్లకు రిపోర్టు చేసుకున్నావనీ వ్రాయించి యియ్యి. ఆ తర్వాత గ్రంథం ఎల్లా నడుస్తుందో, వాళ్ల గతు లే మవుతాయో నీకే తెలుస్తుంది నువ్విల్లా చేశావంటే నువ్వు బియ్యం దొంగరవాణా చేస్తున్న సంగతి కప్పుపడి పోవడమూ, దొంగతనం నేరానికి వాళ్లు శిక్షింపబడడమూ ఒకేసారి జరుగుతుంది —" అంటూ నొసలెగురవేస్తూ చేయవలసిన కార్యక్రమాన్ని సూరయ్యకు బోధించాడు వెంకటపతి

"మీరు గీసినగీటులో నడుస్తాను కడంటా చూడవలసిన భారం మిమ్మల్ని నమ్మి మీమీదే వుంచుతున్నాను—" సూరయ్య వెంకటపతి ఆలోచనను ఆనందంతో అంగీకరించాడు తన తంత్రం ఫలోన్ముఖమైనం

దుకు వెంకటపతి విజయగర్వంతో బ్రహ్మానంద భరితుడై ఆ సంతోషాన్ని పైకి కనబడనీయకుండా చిరునవ్వులో ఒదిగించి—

"చూస్తానుగా!" అంటూ లక్ష్మీనారాయణ అనే మరో రైతుచేత తను చెప్పేవిషయం రిపోర్టు వ్రాయించి సూరయ్యచేత వేలిముద్ర వేయించి ఆకాగితం పుచ్చుకుని మిగతాపని ఉదయం పూర్తిచేస్తానని చెప్పి అందరినీ యిండ్లకు పంపి, తన అదృష్టదేవతను కొనియాడుకుంటూ నిశ్చింతగా నిద్రించాడు.

## 4

తమమీదేమో నేరమాపాదింపబడి అధికార్లకు రిపోర్టు చేయబడిందని గ్రామంలో అస్పష్టంగా చెలరేగిన గుసగుసలను విన్న హరిజనులు ఏదో మోసం జరిగిందని అనుమానించారు ఆందోళనతో వెంకటపతి వద్దకు వెళ్లారు

"సూరయ్యేది రాసిచ్చాడో అదే పంపాను మీరేది రాయించి యివ్వాలనుకుంటున్నారో అదీ యివ్వండి పంపుతాను ఎవరే అర్జీ యిస్తే దాన్ని పైఅధికార్లకు అందజేయడం మా విధి యిందులో నేనుచేసే దేముంది?" – అని తీవ్రంగా సమాధాన మిచ్చాడు వెంకటపతి

"యిప్పటికైనా వెళ్లి అపరాధం మన్నించమని సూరయ్య కాళ్లట్టుకు దేవుళ్లాడండి తాహతు మించి సంబంధంగూలిన పనుల్లో కలుగజేసుకోక వెళ్లండి సూరయ్య వినకపోతే అప్పుడు మాదగ్గరకు రండి ఏదో ఒకటి చేద్దాం" అంటూ ఆదేశించాడు వెంకటపతి ప్రక్కనే కూర్చునివున్న గ్రామమునసబు బసవేశ్వరుడు

వీరాస్వామికి తగిలిన దెబ్బకు అధమం సానుభూతైనా చూపించక గ్రామాధికార్లు సూరయ్యతో సహకరిస్తున్నారని హరిజనులు గుర్తించి తెల్లబోయారు తమకోరకేదో ఆపద పొంచివుందని గ్రహించారు ఆ రాబోయే విపత్తేదో తెలిసికోలేక కలవరపడ్డారు తమలో యే నేరమూ లేకపోయినా తమ ఆర్థికదుస్థితివల్ల తాము గ్రామాధికార్లవల్ల నిర్లక్ష్యం చేయబడి తెలియని యేదో అగాధంలో త్రోయబడుతున్నామని నిర్ణయించుకొని భయోద్రేకంతో గత్యంతరమూహించలేక కంపించి నిరుత్తరులయ్యారు అనిర్దిష్ట భావాలతో, భయాలతో నలిగిపోతున్న వారి ఆలోచనలలో – తామంటే ఏ వేళా సహాయ సానుభూతులు ప్రదర్శించే రామేశం తటిల్లతలా మెరశాగు గ్రామాధికార్ల వద్ద సెలవు తీసుకుని వెళ్లి జరిగిన సంఘటన సామూలాగ్రంగా రామేశానికి తెలియజేసి సహాయాన్నర్థించారు

అసమర్థులూ, అజ్ఞానులూ, నిస్సహాయులూ అయిన వారిమీద నిర్దాక్షిణ్యంగా అత్యాచారానికి పాల్పడడం భావ్యం కాదని గ్రామాధికార్లకూ, సూరయ్యకూ చెప్పజూశాడు రామేశం

సూరయ్యముఖం చిట్లించి రామేశం మాటల్ని వినిపించుకోకుండా వెళ్లిపోయాడు

"నీ కిందులో సంబంధం లేకపోతే నీకీ బెడదంతా ఎందుకు రామేశం?" అన్నాడు వక్రింపుగా వెంకటపతి

"సూరయ్య కొంపమీదపడి దోచుకోమని వాళ్లను పంపింది కాకుండా మాకేదో



ఉపదేశా లివ్వడానికే ముఖం పెట్టుకుని వచ్చావ్?" - అన్నాడు తీవ్రంగా 'ఓ, బ గ్రా ము గ్రా' అనే పొడి అక్షరాల సంతకంమాత్రం నేర్చి, కాకలుతీరిన గ్రామోద్యోగిగా ప్రఖ్యాతిపొందిన బసవేశ్వరుడు

రామేశం నిర్ఘాంతపోయాడు పుష్కలంగా పంటపండిన ప్రదేశాల్లో పావగా పంటనీ, బెడ పంటనీ, - పంట నష్టమయిన చోట్ల పదణాల పంటనీ అంచనాలు వేసి ప్రభుత్వానికి తప్పుడు లెఖ్ఖల నందిస్తూ - దేశంలో క్షామపరిస్థితుల్ని నెలకొల్పడమే కాకుండ, అక్రమ వ్యాపారులైన నిలువ దారులతో సహకరించి ఆకలిచావులకు కూడ కారణమౌతూ - కులానికీ, కులానికీ - వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య విభేదాలనీ, విద్వేషాలనీ పురికొల్పి, కోర్టుల కెక్కించి - శాంతి సౌభాగ్యాలతో, సహనంతో, తృప్తితో, భోగభాగ్యాలతో తులతూగుతూ దేశౌన్నత్యానికి జీవగర్రలుగా వుండే గ్రామసీమల్ని - దరిద్రదేవతా విహారభూములుగాజేసి, వికటాట్టహాసాలతో ఆనందించే గ్రామోద్యోగుల్ని తలచుకుని ఉద్విగ్నుడయాడు

దేశాన్ని పరిపాలిస్తున్న స్వదేశీ ప్రభుత్వం తలపుకువచ్చి సంఘవిద్రోహు లరికట్టబడ గలరనే విశ్వాసంతో కల్గిన ఉత్సాహోద్రేకంతో పోలీసువారివద్దకూ, రివెన్యూ అధికార్లదగ్గరకూ, ఆహారశాఖోద్యోగుల ఎదుటకూ హరిజనులను అర్జీలతో పంపి యావద్విషయాన్ని సముఖంలో చెప్పించాడు

"అయ్యో! పాపం దెబ్బ బలంగానే తగిలిందే! - విన్నాంగా, వెళ్లండి తర్వాతవచ్చి విచారణచేస్తాం" -అన్నారు ఆహారశాఖోద్యోగులు మొసలి కన్నీళ్లతో

"మీరేదో దోపిడీ చేశారని ప్రొద్దుటే స్టేషనుకు రిపోర్టువచ్చింది చూడగా యికే మోపార్టీల గంద్రగోళంలా కన్పిస్తోంది వీలుచూసుకుని వస్తాము ఈ లోపున అల్లర్లు చేశారంటే ప్రూచలు లెక్కపెడతారు, జాగ్రత్త వెళ్లండి-" అన్నారు తీవ్రంగా పోలీసువారు

"అరే! వాడికి తలపగిలిందే!- సంఘటన జరిగిన తక్షణంవచ్చి ఎందుకు చెప్పారుకాదు?- యింతకీ గ్రామాధికార్లు లంచం పుచ్చుకోవడం మీరు చూశారా?- లేపోతే వూహించారా?-కర్ణం మునసబుల్ని తీరికైన తర్వాత కబురుచేసి కనుక్కుంటాను మీరింక వెళ్లవచ్చు" అన్నాడు నీళ్లు నములుతూ రివెన్యూ అధికారి

అధికార్లకు రిపోర్టుచేశారనే సరికి భూస్వాములు హరిజనులను పనిపాటలకు, కూలికి పిలువక బహిష్కరించారు రామేశంమీదా హరిజనులమీదా కక్ష వహించారు రోజులు వారాలు దొర్లిపోయాయి కాని ఏ అధికారీ గ్రామంలోకివచ్చి నేరవిచారణచేసే బాధ్యత వహించనందుకు రామేశం ఆశ్చర్యపడ్డాడు క్రిందినుంచి పైదాకా ఆహారసమస్యతో సంబంధమున్న ప్రతి అధికారికీ గ్రామంలో జరిగిన బియ్యం దొంగరవాణా వ్యాపారాన్ని వివరిస్తూ హరిజనులచేత తిరిగి అర్జీల నిప్పించాడు

"ప్రజలు ప్రభుత్వంతో సహకరించి అక్రమ నిలువదారుల్ని, దొంగవ్యాపారుల్నీ, తిండిదొంగలనీ బయటపెట్టండి ప్రభుత్వం దోషుల్ని తీవ్రంగా శిక్షించేందుకు కఠినశాసనాల నములులో పెట్టింది" అని ప్రతిరోజూ పత్రికలలో ప్రభుత్వ ప్రకటనలు చదువుతున్న రామేశం తమ అర్జీలు విచారణకు రాకపోవడం చూసి ఆ ప్రకటనలు ఏ ప్రభుత్వం, ఏ ప్రజల నుద్దేశించి ప్రకటించిందో తెలిసికోలేక సతమతమయ్యాడు ధాన్యం పండించినవారికి రేషను కార్డుల నిచ్చిన గ్రామాధికార్లు అక్రమ వ్యాపారాన్నీ, తిండిదొంగల్నీ ప్రోత్సహిస్తున్నవారి లెఖ్ఖకు రారేమో నని భావించాడు గ్రామంలో ప్రజలు తిండి గింజలు లభ్యమవక బాధపడేసమయంలో అధిక లాభవాంఛతో బియ్యం మరో చోటికి తరలిస్తున్నా - సూరయ్యా భూమి దున్నే రైతవడంవల్ల దొంగవ్యాపారి కాదేమో నని అనుమానించాడు ఆ తరలింపు చట్ట విరుద్ధమని భావించినా, ఆకలితో అలమటిస్తున్న క్రింద తరగతివ్యక్తులు ఫిర్యాదు చేసి

వుండడంచేత వారు ప్రభుత్వ ముద్దేశించిన ప్రజలు కారేమో ననీ - అథవా వారు ప్రజలని వుద్దేశింపబడ్డవారు బంట్లను నిరోధించిన కారణంగా ప్రభుత్వం దృష్టిలో ఆ చర్య సహాకారం క్రిందకు రాదేమో ననీ తలపోసి-

పరస్పర విరుద్ధ భావాలతో మునిగిపోయాడు రామరాజ్యంలో సామాన్య పౌరుడుగా జీవించివుండడంకంటె, దుర్భర పరిస్థితి మరొకటి లేదని దీర్ఘనిశ్వాసం వదలుటకన్న గత్యంతర మూహించలేక మథనపడ్డాడు కొద్దో గొప్పో ధనవంతుడుగా చెలామణీ అవుతున్న తన ప్రోత్సాహంతో హరిజనులు సూరయ్య యింట్లోపడి ధాన్యం దొంగిలించారనడంవల్ల ఆ లక్ష్మీదేవిముఖం చూసి తన సంజాయిషీ విన్న పోలీసువారా ఆరోపణను విశ్వసించలేకపోయారు కాని లేకుంటే తానూ తనమీద ఆశలు పెట్టుకుని వున్న హరిజనులూ ఈపాటికి ప్రభుత్వం వారి అతిథులుగా వుండవలసివచ్చే దనే విషయం గుర్తుకు వచ్చి భారంగా నిట్టూర్చాడు వీరాస్వామి గాయం మానక కూలికి వెళ్ళలేని స్థితిలో వుండడంచేతా - రైతులు బహిష్కరించిన కారణంగా పద్దాలుకు కూలిపని దొరకని కారణంచేతా వాళ్ళ మనుగడ హృదయవిదారకంగానూ, ఎంతో శోచనీయంగానూ పరిణమించడం తలపుకువచ్చి రామేశం కళ్లు చెమ్మగిలాయి తమకు జరిగిన అన్యాయానికి హరిజనులు వారం వారం యిస్తున్న అర్జీలు విచారింపబడుతాయని ఆశించడం మరీచికలను చూసి మంచినీటి నెలవులుగా భ్రమించడంవంటిదేనని ధృవపరచుకున్నాడు.

## 5

ఎన్ని దినాలు గతించినా తానిచ్చిన రిపోర్టు ననుసరించి పోలీసులు రామేశంనూ అయిదారుగురు హరిజనులనూ బధించక పోవడంచేత సూరయ్య వెంకటపతి సలహా మీద మేజస్ట్రేటు ఎదుట కేసు పెట్టాడు

ఈ సంగతి తెలిసికొన్న రామేశం, వీరాస్వామిని కొట్టినందుకు తా నవలంబించ గల్గిన ఆఖరి చర్యగా సూరయ్యమీదా అతనితో సహకరిస్తూ హరిజనులను బాధిస్తున్న వెంకటపతిమీదా వీరాస్వామిచేత ఛార్జీ యిప్పించాడు

రెండు సంవత్సరాలు వాయిదాలతోనే గతించాయి చిట్టచివరకు మేజస్ట్రేటు దగుతలచినందువల్ల రెండు కేసులూ విచారణ ప్రారంభమయాయి ఇరుపక్షాల న్యాయవాదులూ వాదోపవాదాలు చేశారు

గ్రామంలో నలుగు రయిదుగురు వ్యక్తులు ఆహారశాఖోద్యోగి ఎదుట యిచ్చినట్టున్న సాక్ష్యమూ, దానిపై ఆహారశాఖోద్యోగి వ్రాసిన రిపోర్టూగల రికార్డును వెంకటపతి తమ కేసును బలపరిచే సాక్ష్యాలుగా మేజస్ట్రేటు ఎదుట ప్రదర్శింపజేశాడు

రామేశం తెల్లబోయాడు గతించిన యిరువైయారు మాసాల్లోనూ ఒక్కసారి కూడ గ్రామంలోకి వచ్చి వుండడంగాని విచారణ చేసి వుండడంగాని యెరగని ఆహారశాఖోద్యోగి ఆ సాక్షుల నెక్కడ ఏవిధంగా విచారించి హరిజనులిచ్చిన ఫిర్యాదు సర్వాబద్ధమని నిర్ణయించి రిపోర్టు వ్రాయగలిగాడో అర్థం చేసుకోలేక నిశ్చేష్టితు డయాడు.

ఆహార శాఖాధికారి రిపోర్టు వీరాస్వామి యిచ్చిన ఛార్జీ అసత్యమని రుజువు చేస్తున్నదనీ, తన ఛార్జీని బలపరచే సాక్ష్యం వీరాస్వామి చూపలేకపోయాడని తను అభిప్రాయపడుతున్నాననీ - సూరయ్య పెట్టినకేసును బలపరచేందుకు కావలసినంత సాక్ష్యమున్నదని నమ్ముతూ ఆ కేసులో ముద్దాయిలయిన రామేశం, వీరాస్వామి, నాగన్న, వెంకటేశు, అంకాలు, అప్పలు, రాములు గార్లకు ఒక్కొక్కరికీ మూడు నెలల కఠినశిక్ష విధిస్తున్నాననీ న్యాయమూర్తి తీర్పు నిచ్చాడు

శిక్షితులు పోలీసులతో కోర్టుగుమ్మం దాటబోతూంటే— ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం, అవినీతి ప్రవర్తన నశింపుజేసేందుకు ప్రభుత్వం తీవ్రచర్యలు తీసుకుంటున్నది, గతనెలలో ముగ్గురు రివెన్యూయిన స్పెక్టర్ల బంట్రోతులూ, నల్గురు సబురిజస్ట్రారు ఆఫీసుసేవకులూ, ఒక పోలీసు కానిస్టేబులూ లంచగొండి నేరంక్రింద విచారింపబడి నౌకరీ నుంచి భర్తరఫు చేయబడ్డారు"—అంటూ ఒకాయన పెద్దకంఠంతో చదువుతున్న దినపత్రికలోని వార్తను విన్న రామేశం "రామరాజ్యం!-" అన్నాడు ఎండిపోయిన కంఠస్వరంతో"

★

# సినిమా

(23-వ పేజీ తరువాయి)

ఓమూ సాధారణంగా జరగదు. హాలీవుడ్ లో గొప్ప డైరెక్టర్లందరూ, ప్రొడ్యూసర్లు కూడానూ అందులో కొద్దిమంది తమ స్క్రిప్టు తామే రాసుకుంటారు మన దేశంలోకూడా ఇటువంటి ఏర్పాటున్నది. నితిన్‌బోస్ డైరెక్టరు, కామెరామాన్, స్క్రిప్టురైటరు

మన సినిమా చిత్రాల భావిఅభివృద్ధి సర్వతోముఖమైన నైపుణ్యంగల వారిపై ఆధారపడి ఉన్నది ఇటువంటివారే ఇకముందు సినిమా చిత్రనిర్మాణాన్ని నడుపుతారు లేదా, ఒక ప్రొడ్యూసరు కొక డైరెక్టరూ, ఒక డైరుక్టరు కొక స్క్రిప్టు రైటరూ ఖాయమైపోయి చిత్రనిర్మాణం సాగించాలి అంతేగాని కొంతకాలం కిందట కిరాయి నాటకాల వతుగా కొంతమంది పేరున్న నటులనూ, ఒక పేరున్న డైరెక్టరునూ, ఒక పేరున్న స్క్రిప్టు రైటర్నూ చేర్చి గొప్ప చిత్రాలు తీసే ఆశలేదు

సినిమా చిత్రనిర్మాణంలో ఒక క్రమాభ్యుదయం కనపడాలంటే చిత్రనిర్మాణానికిగాను పాటుపడే నిపుణులలో ఐక్యతేగాక వారిమధ్య సమలక్ష్యాలుకూడా ఏర్పడాలి సినిమాకళకు వారు ముందుగానే కొన్ని ఆశయాలు తమలో తాము నిర్ణయించుకుని వాటికోరకు కలిసి పనిచెయ్యాలి ఎవడిమటుకు వాడు తన జీతభత్యాలను గురించే, తన లాభంగురించే ఆలోచిస్తున్నప్పటికీ పరిశ్రమ ముందరికి పోతుందనుకునే, ఆశ ఇతర పరిశ్రమలలో ఉండవచ్చుగాని సినిమాలో లేదు ఇతర పరిశ్రమలకూ సినిమాపరిశ్రమకూ గల ముఖ్యభేదాలలో ఇదికూడా ఒకటి






# చిన్నిపిట్టజాలి

శ్రీ ఆకెళ్ల సుబ్రహ్మణ్యకవి

తల్లి ఒడిలో మెల్లమెల్లగ
పిల్లగంతులు వేయు శిశువులు
చల్లగా పాలిచ్చి పెంచగ
అల్లరులు చేయుటయె తెలుసును.

అమ్మపడు శ్రమలన్నియేవియు
అరయుటకు అజ్ఞానులౌటను
ఆకలీయని యరచుచుందురు
అన్నమే కరువనుచు నెరుగరు.

కాలుకాలిన పిల్లివలె తా
గన్నబిడ్డల కడుపుమంటను
గనుచు కన్నీరొలుక నెల్లర
కాళ్లపైబడి వేడుచుండును

తన దరిద్రముతోడు మగడును
తనయులను నిర్భాగ్యులను విడి
చనియె నెటకో దూరదూరము
తనకు తప్పదు కన్నతీపికి

ఆడదానికి వ్రాసిపెట్టెనో
పాడువిధి పురుషులకు చుట్టమొ
గోడు వినరెవరెంత వేడిన
మ్రోడుగుండెల మనుజులంచును.

లోన దిగులును తిండికరువును
మానమును గాపాడు పీలిక
మేనదాలిచి చింపితలతో
కోనకోనలు తిరుగునాయమ.

పిల్లకాయలు వెంటనంటగ
తెల్లవారిన దాది తిరుగుచు
నల్ల దెయ్యపు చీకటింబడి
యిల్లు జేరును చిల్లుపిడతల.

కనికరించిన కన్నతల్లుల
గంజినీళ్లకు కన్నబిడ్డల
కడుపునింపుచు తానుమాత్రము
కడుపుమాడుచు కనులుమూయును.

అయ్యో నా బిడ్డలకు పట్టెడు
అన్నమే నిడలేని దానను
అన్నలును తమ్ములును తండ్రులు
అందరుండగ లేనిదానను

అందరును నా నరకుటుంబము
నందు బుట్టిన వారలైనను
అన్నమునకే మోమువాచిన
యట్టులుంటిమి పేదలంచును.

పేగలయితే నరులుకారా!
పెద్ద మేడలవారు నరులా!
పేదలయితే తిండి తినరా!
పెద్దవారికె విందులా!



# ముగ్గురు అన్నదమ్ములు

శ్రీపతి

ఒకవూళ్లో ముగ్గురు అన్నదమ్ములుండేవాళ్ళు వాళ్ళకు వక చిన్నయిల్లు తప్ప యింకేమీ ఆస్తి లేదు. వాళ్లు కాయ కష్టం వల్ల బ్రతుకుతుండేవారు వాళ్లు వచ్చిన డబ్బును వక్కచోట చేర్చి తమ భుక్తి గడవగా మిగిలిన దానిని దాన ధర్మాలు చేస్తూ జీవితం గడుపుతూ యుండేవారు

ఒకనాడు వాళ్లు ముగ్గురుయింట్లో వున్నారు అప్పుడు అక్కడికి వొక సన్యాసి వచ్చాడు ఆ సన్యాసిని చూసి వాళ్లు భక్తితో నమస్కరించి లోనికి ఆహ్వానించారు ఆ సన్యాసి యెండలో నడచి వచ్చుట వలన అలసియుండటం గమనించి కొన్ని పండ్లు కాసినిపాలు సమర్పించి ఆరగించ మన్నారు. సన్యాసివాళ్ల భక్తికి సంతసించి అవి భుజించి శుభము కలిగేటట్లు ఆశీర్వదించి వెళ్లాడు

కొన్ని రోజుల తరువాత వాళ్లు ముగ్గురు పనుల కెళ్లటానికి సిద్ధమవుతూ యుండగా యిదివర కొచ్చిన సన్యాసే తిరిగి వచ్చాడు అందరు ఆయనకు నమస్కరించారు ఆ సన్యాసి ఆముగ్గుర్ని తన వెంబడి రమ్మనమని చెప్పాడు, వాళ్లుకూడా యెందుకు రమ్మనమంటున్నాడో యని మాత్రం ముగ్ధుల్లాగా వెంబడించారు

వాళ్లు నలుగురు బయలుదేరి కొంత సేపటికి వక అడవిలో కొచ్చారు అడవిలో కొంతదూరం నడచి వెళ్లిన తరువాత సన్యాసి పెద్ద వాణ్ణి తన దగ్గరకు పిలిచి 'నాయనా! నీ కేమి కావాలో కోరుకొన' మన్నాడు పెద్దవాడు కొంచెంసేపు ఆలోచించి 'ఈ అడవిలోని చెట్లన్ని పండ్ల చెట్లుగా మారాలి వాటికి నేనే యజమానినై ధనవంతుడగునట్లు అనుగ్రహించు' మన్నాడు సన్యాసి త

(43-వ పేజీ చూడండి)

బొమ్మరిల్లు సీరియల్

# రాజా — పేద

## మార్క్ ట్వేన్

జరిగిన కథ :—

1537 వ సంవత్సరం [illegible] ఎడ్వర్డు అనే కొడుకూ, నిరుపేద జాన్ కాంటీకి [illegible] [illegible] పదేళ్ళ వయస్సు [illegible] టామ్ రాజభవనానికి [illegible] యువరాజు ఎడ్వర్డ్ [illegible] ఒకరి జీవితంమీద మరొకరికి ఆసక్తి కలిగి [illegible] [illegible] ప్రజలు [illegible] యువరాజునంటున్న [illegible] యువరాజుగా [illegible] [illegible] యువరాజు ఎడ్వర్డును మైల్స్ హెండన్ [illegible] [illegible] నిజమైన [illegible] ఇక చదవండి

**19**

మైల్స్ హెండన్ బాలరాజును వెదుకుతూ సౌత్ వార్కు వైపు బయల్దేరాడు. వాళ్ళనీ వీళ్ళనీ అడుగుతూ, బాలరాజు ఏ వేపు తీసుకుపోబడ్డాడో కొంతవరకూ గుర్తుపట్టాడు. ఆ రోజు సాయంత్రం వరకూ సౌత్ వార్కులోనే తన అన్వేషణ సాగించాడు. ఎంతసేపు ప్రయత్నించినా అలిసిపోవడమే తప్ప అతని ప్రయత్నాలేమీ ఫలించనే లేదు. ఒక సత్రంలో కాస్త ఎంగిలిపడి ఒక మంచం అద్దెకు తీసుకుని నడుం వాల్చాడు.

హెండన్ అనుకున్నాడే గాని

అనువాదం

శ్రీ

నండూరి రామమోహనరావు

అతని మనస్సంతా బాలరాజు మీదనే లగ్నమై వుంది పసివాడు కొంతసేపటికైనా గుర్తిస్తాడు, తను అపాయంలో పడ్డట్టు గుర్తించి ఆ తాగుబోతునుంచి తప్పించుకునే ప్రయత్నాలు చేస్తాడు తప్పించు కొంటే ఎటు పోతాడు? లండన్ నగరానికా? ఊహు పోడు ఎందుకంటే లండన్ వెడితే మళ్ళీ అపాయాల్లో చిక్కుకున్నట్టే. అయితే మరి ఎటు పోతాడు? మైల్స్ హెండన్ ఒక్కడే తన్ను రక్షించగల స్నేహితుడని అతనికి తెలుసు. కనుక అతనికోసం వెదుకుతాడు మైల్స్ హెండన్ తన స్వగృహమైన హెండన్ హాలుకు వెళ్లదలచుకున్నాడని అతనెరుగును అందుచేత అతడు కూడా హెండన్ హాలుదారే పడతాడు. ఆ అంతే. ఇప్పుడంతా స్పష్టమైపోయింది సౌత్ వార్కులో ఆలసిస్తే లాభం లేదు. వెంటనే హెండన్ హాలు దిసగా మార్గమంతా అన్వేషిస్తూ బయల్దేరిపోవాలి —ఇక బాలరాజు గతి ఏమైందో చూద్దాం

బాలరాజును తీసుకుపోయిన కొత్త యువకుడిని ఎవడో తాగుబోతు కలుసుకున్నట్టు వంతెన సత్రవలోని నౌకరు చెప్పాడు కాని ఆ తాగుబోతు వాళ్ళని వంతెనమీద కలుసుకోలేదు. వెనక వెనక అనుసరించాడు. వాడి ఎడమ చెయ్యి సగానికి మడిచి కట్టు కట్టబడి వున్నది. ఎడమ కంటికి కూడా ఎర్రటి గుడ్డ కట్టబడి వుంది కర్రపుచ్చుకుని కొద్దిగా కుంటుతున్నాడు కొత్త యువకుడు బాలరాజును చాలా సందులు గొందులు తిప్పి మొత్తానికి సౌత్ వార్కు గ్రామం దాటించాడు ఆపైన అన్నీ కీకారణ్యాలే. బాలరాజు ఇంతసేపూ చిరాకుతోనే నడుస్తున్నాడు సౌత్ వార్కు దాటగానే ఇక కోపం పట్టలేకపోయాడు ఒక్క అడుగైనా ముందుకు కదలనన్నాడు 'కావలిస్తే హెండన్ నే ఇక్కడికి రమ్మను అతనికోసం మహారాజైన నేను నడిచివస్తానా' అని పట్టు పట్టాడు

కొత్త యువకు డన్నాడు "మహారాజా! తమ స్నేహితుడు ఆ అడవిలో గాయాలు తిని పడిపోయాడు. అత డెలా రాగలడు?"

"గాయపడ్డాడా? అరెరె చెప్పవేం? ఎవడా ద్రోహి, నా స్నేహితుణ్ణి గాయపరిచింది? ఆ ద్రోహి ఎవడైనా సరే శిక్షించి తీరుతాను పద, దారి చూపు"

యువకుడు బాలరాజును అడవిలోకి తీసుకువెళ్ళాడు చెట్ల మధ్య సన్నని కాలిబాట వున్నది పోయి పోయి ఒక పాడుపడినగుడిసె చేరుకున్నారు. ఎక్కడా ప్రాణి సంచలనం లేదు. పరిసరాలన్నీ నిశ్శబ్దంలో మునిగి వున్నాయి యువకుడు గుడిసెలో దూరాడు బాలరాజు కూడా లోనికి పోయి చూశాడు అక్కడెవరూ లేరు బాలరాజుకు చటుక్కున అనుమానం కలిగింది.

"ఎక్కడతడు?"

యువకుడు హేళనగా నవ్వాడు. బాలరాజు వెంటనే క్రోధంతో కంపించాడు పక్కనున్న ఒకరాయి ఎత్తి యువకుని పైకి దూకబోయాడు ఇంతలో మరొక వికటాట్టహాసం వినబడింది వెనక్కి తిరిగిచూడగా, ఇందాక వెనకాలే కుంటుతూ వచ్చినవాడు

"ఎవరు నువ్వు? నీకిక్కడేం పని?"

"ఏకిశావులే ఎంత వేషం వేసుకుంటే మాత్రం నీ అబ్బనే నువ్వు గుర్తు పట్టలేవట్రా?"

"నువ్వు నాతండ్రివి కాదు నేను నిన్నెరగను నేను మహారాజుని నా సేవకుణ్ణి ఎక్కడ దాచావో చెప్పు లేకపోతే నీకు ఘోరమైన శిక్షవిధిస్తాను"

"నీకు పిచ్చెత్తినమాట నిజం. పిచ్చాణ్ణి కొట్టడానికి చేతులు రావటంలేదు కాని నాకు కోపంవచ్చిందంటే మనిషినికాను ఇక్కడ నువ్వెంత పిచ్చిగా వాగినా ఫరవాలేదు అయినా మనం జాగ్రత్తగా వుండాలి విను నేనొకణ్ణి చంపాను. పోలీసులు నన్ను వెదుకుతున్నారు అందుకని మన పేర్లన్నీ మార్చేశాను నా పేరిప్పుడు జాన్‌హాబ్స్. నీపేరు జాక్ నువ్వు ఈనారి పారిపోయావంటే వూరుకోను నువ్వు నాకు అవసరం దొంగతనాలకి వాటికి, నిలాంటి వాడొకడు లేందే యెట్లా? చెప్పు నీఅమ్మ, బామ్మ, ఆడపిల్లలు ఎటుపోయారు? వంతెన చివరకు రమ్మని చెబితే రాకుండా ఎటుపోయారు?"

"నాకేం తెలియదు. నా తల్లిగారు నా చిన్నప్పుడే చనిపోయింది నా అక్కగార్లు రాజభవనంలో వున్నారు"

ఇదంతా వింటున్న యువకుడు

పెద్దపెట్టున నవ్వాడు. బాలరాజు అతని మీదికి రాయి విసిరేవాడే; కాని జాక్ కాంటీ - కాదు, వాడు పేరు మార్చుకున్నాడుగా - జాక్ హాబ్స్ రాయి లాగి పారవేశాడు.

"ఒరే హ్యూగో! కుర్రాణ్ణి ఏమనకురా. వాడికి బొత్తిగా పిచ్చెక్కింది. ఒరే జాక్. కూర్చో అక్కడ కదలకుండా. జాగ్రత్తగా మసులుకుంటే నీకు కాస్సే పాగి ఓ రొట్టెముక్క పారేస్తా."

హాబ్స్, హ్యూగో లిద్దరూ ఒక మూల జేరి రహస్యంగా ఏదో సంభాషణ ప్రారంభించారు. బాలరాజు గుడిసెలో ఇంకో మూలకు పోయాడు. అక్కడ గడ్డివుంటే దానిమీద పడుకున్నాడు. చనిపోయిన తండ్రిని తలుచుకుంటే అతనికి దుఃఖం మళ్లీ ఫుక్కిలింతలుగా వచ్చింది. అలాగే ఏడుస్తూ నిద్రపోయాడు.

నిద్రలేచేటప్పటికి అప్పుడే చీకటి పడుతోంది. గుడిసెమీద వాన చినుకులు శబ్దం చేస్తున్నాయి. బాలరాజు కళ్లు మూసుకుని మళ్లీ కొంచెం కునుకుతీశాడు ఇంతలో ఏదో గల్లంతు వినబడి, ఉలికిపడి లేచాడు గుడిసెలో ఎవరెవరో జనం కిక్కిరిసి ఉన్నారు. మధ్యగా చలిమంట వున్నది. ఆడవాళ్లు మగవాళ్లు, ముసలివాళ్లు, పడుచువాళ్లు, చంటిపిల్లలు అన్నిరకాలవారూ ఉన్నారు. దున్నపోతుల్లా మదించి, కోరమీసాలతో, పొడుగు వెంట్రుకలతో పిశాచాల్లాంటి వారు కొందరు, వింతవింత దుస్తులు ధరించిన ఒకమాదిరి యువకులు కొందరు; కళ్లమీద పట్టీలు వేసుకున్న గుడ్డిబిచ్చగాళ్లు కొందరు, కొయ్యకాళ్లు పెట్టుకుని, ఊతకర్రలు గల కుంటిబిచ్చగాళ్లు కొందరు; అందులో ఒకడు ఊళ్లు తిరిగి సరుకు అమ్ముకునేవాడు; వాడిపక్కనే వాడి సరుకులసంచి వున్నది, ఒకడు చాకులు పదునుపెట్టేవాడు, ఒకడు పాత్రలకు మాట్లు వేసేవాడు; ఇంకోడు మంగలి. ఆడవాళ్లలో కొందరు పడుచుపిల్లలున్నారు, కొందరు నడుంవంగి, ఒళ్లు ముడతలు పడ్డవాళ్లున్నారు, గుడ్డి బిచ్చగాళ్ల పక్కన వాళ్లని నడిపించేందుకుగావును పెంపుడు కుక్కలున్నాయి, వాటికి డొక్కలంటుకుపోయి ఈసురోమంటున్నాయి.

ఇదంతా ఒక పెద్ద దొంగల గుంపు. ఇప్పుడే వాళ్లవిందు ముగిసింది ఇక ఆటపాటలు ప్రారంభం కానున్నాయి ఒకతె కల్లుకుండలోంచి కల్లుపోస్తోంది అందరికీ కల్లుతాగినకొద్దీ ఉషారెక్కువౌతోంది.

"ఉ. ఇక పాటలు కానివ్వండి. ఇవ్వాళ కుంటినక్క, గుడ్డి కొక్కిరాయి పాటలు పాడాలి." అని కొందరు అరిచారు.

కుంటినక్క లేచాడు. కొయ్యకాలు ఊడలాగి అసలు కాళ్లమీద నిటారుగా నుంచున్నాడు. గుడ్డికొక్కిరాయి కళ్ళమీద అతికించుకున్న పట్టీలు లాగేసి ఆరోగ్యవంతమైన కళ్లురెండూ ప్రదర్శించాడు వాడిమెల్లో అట్టముక్క ఒకటి వేళ్లాడుతోంది. దానిమీద "అయ్యా, గుడ్డివాణ్ణి, ధర్మం చెయ్యండి," అని అక్షరాలున్నాయి. ఆ అట్టముక్కకూడా తీసేసి తన తోటి దొంగపక్కనే నుంచున్నాడు.

చేతులో కల్లుముంతలు పుచ్చుకుని పాటగాళ్లు చిందులువేస్తూ పాట ప్రారంభించారు.

"సక్కాని సుక్కవే. " ప్రేక్షకులు, తాళంవేస్తూ "ఓ సెన్నదాన!" అని పల్లవి అందుకున్నారు.

"సక్కానిసుక్కవే—ఓసిన్నదాన
సుక్కలకురాణి వే—ఓసిన్నదాన
నన్నేలుకోవటే—ఓసిన్నదాన
కన్నెత్తిసూడవే—ఓసిన్నదానా"

పాట, చిందులు ఇంకా హైస్థాయిలోకి పోయాయి. అంటే కైపు బాగా తలకెక్కిందన్నమాట.

కల్లగాదు నీతోడు—ఓసిన్నదాన
కల్లుతోడు ముంతతోడు—ఓసిన్నదాన
నిన్నచేల నిన్నుసూసి—ఓసిన్నదాన
నిలవలేక నీరసిస్తి—ఓసిన్నదాన
కట్నాలుకానుకలు—ఓసిన్నదాన
కరువుదీర తెచ్చానె—ఓసిన్నదాన

ఈవిధంగా కొంతసేపు కాలక్షేపమయ్యాక సభప్రారంభమయింది. మంటకు దగ్గరసా కూర్చున్నవారిలో ఒక ఆజానుబాహుడున్నాడు. వాడు ఈ ముఠాకు నాయకుడు. దొంగల మాటలలో "జాక్ హాబ్స్" ఈముఠాలో పాత సభ్యుడేనని, ఈ నాయకుడిదగ్గర తర్ఫీదు పొందినవాడేనని తెలిసింది. అతన్ని పూర్వం ఎరిగినవాళ్లు ఇంకా కొందరు ముఠాలో ఉన్నారు. వారతన్ని కుశలప్రశ్నలు వేశారు ముఠాలోంచి విడి

పోయాక ఏమేం జేశావని అడిగారు. చాలా ఏళ్లనుంచీ లండన్లోనే కాపురం ఉంటున్నాననీ, లండన్ నగరమంత సుఖమైన ప్రదేశం ఇంకోటి లేదనీ హాబ్స్ చెప్పాడు. అయితే మరి లండన్ వదిలి ఎందుకు వచ్చేశావని వాళ్ళడిగారు. అతడొక మనిషిని హత్య చేశాడని తెలియగానే దొంగల సంతోషానికి మేరలేకపోయింది. హత్యచేయబడినవాడు మతగురువని తెలియగానే వాళ్ళ ఉత్సాహం, ఆనందం పెల్లురేగిపోయాయి. ఒక్కొక్కరే వచ్చి జాక్ హాబ్స్ని కరస్పర్శ చేసి అభినందించారు

ముఠాలో ఇప్పుడు ఎంతమంది సభ్యులున్నారని హాబ్స్ అడిగాడు దొంగల నాయకుడు సమాధాన మిచ్చాడు :

"కన్నపుదొంగలు, బందిపోట్లు, హంతకులు, జేబుదొంగలు అంతా కలిసి పాతిక ముప్పయి దాకా ఉంటారు. ఇంకా కొందరు మన వాళ్లే తూర్పుకు పోతున్నారు. రేపు మనం కూడా వాళ్ళతోపాటు తూర్పుకు ప్రయాణమై పోతున్నాం"

"ఇక్కడున్న పెద్ద మనుషుల్లో వెన్ కనిపించడేం? విడిపోయాడా?"

"పాపం వెన్ వీరస్వర్గ మలంకరించాడు కిందటి వేనాకాలం ఒక ముట్టడిలో తల పగిలి చచ్చిపోయాడు."

"పాపం. వెన్ నిజంగా సమర్థుడైనవాడు మాంచి ధైర్యస్థుడు ఆయన లేకపోవటం మన సంఘానికి తీరనిలోటు."

"నిజమేమరి. కాలం కలిసిరాక చచ్చిపోయాడు ఏంచేస్తాం? ఆయన ఉంచుకున్న ముండ బెస్సీ ఇప్పుడు మనకిందే ఉంది అదికూడా తూర్పుకు పోతున్నది. రేపు చూస్తావుగా దాన్ని చాలా మంచిపిల్ల. నియమం, నిగ్రహంగల మనిషి. వారానికి ఆరు రోజులకంటే ఎక్కువ తాగదు."

"అవునవును జ్ఞాపకముంది మెచ్చుకోదగిన పిల్ల దానితల్లి ఎక్కడుంది? చచ్చిపోయిందా? ఆ ముసల్దాని తెలివితేటలు నిజంగా పరమాద్భుతం. అంత జిత్తులమారి నక్క నింకెక్కడా చూళ్లేదు"

"ఆ జిత్తులవల్లే అది చచ్చిపోయింది దానికి సోది చెప్పడం వచ్చునుగదూ. అందుచేత దాన్ని మంత్రగత్తె కింద కట్టి చంపారు మంటల్లో వేయించి కాస్త కాస్తే చంపారు ఎంత ధైర్యంగా, నిబ్బరంగా ప్రాణాలు వదిలిందనుకున్నావ్? నాకు బలే ఏడుపొచ్చిందప్పుడు మంటచుట్టూ జనం చేరి చూస్తున్నారు మంటలు లేచి నెమ్మదిగా ఒక్కొక్క చేతినీ, కాలినీ ఉడకబెడుతున్నాయి. అప్పుడది తిట్టిన తిట్లు వర్ణనాతీతం. శాసనాలని, చట్టాలని, దేశాన్ని, అధికారుల్ని, ప్రజల్ని అందర్నీ తిట్టింది. ఊరికే చచ్చిందా? వీరోచితంగా చచ్చింది వెయ్యేళ్లు బతికినా అటువంటి తిట్లు నువ్వు వినలేవు రకరకాల బూతులు కల్పించి తిట్టింది బూతుల్లో మమ్మల్ని మించినవాళ్లు లేరని గర్వపడే మేమంతా సిగ్గుపడిపోయాం. కాని విచారించదగ్గ విషయమేమంటే దాని బూతు కవిత్వమంతా దానితోనే చచ్చింది దాని శిష్యులు దేశమంతటా వున్నారు గాని ఒక్కళ్లకీ దాని కవిత్వం చేతగాదు పాపం చచ్చిపోయింది."

అంటూ దొంగల నాయకుడు కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు. మిగతావాళ్లు కూడా సానుభూతితో నిట్టూర్పులు విడిచారు. అంతా విచార సముద్రంలో మునిగిపోయారు. మామూలుగా దొంగలు ఎంత కఠినాత్ములైనా, వాళ్ళకికూడా అప్పుడప్పుడు అంటే పదేళ్ల కోసారి జాలి, ప్రేమ మొదలైన భావాలు కలక్కపోవు. అందులో ముఖ్యంగా బెస్సీ తల్లి వంటి గొప్ప గొప్ప కవులు చచ్చిపోవడం వాళ్లకు మరీ దుఃఖాన్ని కలిగిస్తుంది.

మళ్ళీ తలొక ముంతా ఖాళీ చెయ్యగానే పోయిన ఉత్సాహ సంతోషాలు తిరిగి వచ్చాయి

"మన స్నేహితుల్లో ఇంకా ఎవరన్నా కష్టాలు పడ్డారా?" అని హాబ్స్ దొంగల నాయకుని అడిగాడు

"అఆ తిండికి జరక్కపోతే ఏంచేస్తారు? ముఖ్యంగా కొత్తగా మన వృత్తిలోకి వచ్చినవాళ్లు మరీ కష్టపడ్డారు. వాళ్లు మొదట్లో గౌరవస్థులైన రైతులు వాళ్ల పొలాల్ని జమీందార్లు లాక్కుని గొర్రెల బీళ్లుగా మార్చుకున్నారు. పాపమా రైతులు మరేపనీ చేతకాక బిచ్చమెత్తుకోడం ప్రారంభించారు; రాజభటులు పట్టుకుని చొక్కాలూడదీసి నెత్తురొచ్చేదాకా కొట్టారు, మనవాళ్లు మళ్లీ బిచ్చ

మెత్తారు, రాజభటులు కొట్టి ఒక్కొక్క చెవి కోసేశారు; వాళ్లు మూడోసారి బిచ్చమెత్తారు ఈసారి భటులు చెంపలమీద వాతలుపెట్టి బానిసలుగా వేలంవేశారు మన స్నేహితులు పారిపోయారు, పట్టుబడ్డారు, చివరికి వాళ్లపీడ ఉరిశిక్షతో వదిలిపోయింది ఇల్లా వున్న దబ్బాయ్ దేశం నుంచోండిరా యోకెల్, బర్న్స్, హోడ్జ్ మీమీ అలంకారాలు చూపించండి"

ముగ్గురుసభ్యులు లేచి తమ వీపులు ప్రదర్శించారు వాటిపై అడ్డదిడ్డంగా వాతలున్నాయి. ఒకడు జుట్టు తొలిగించి పూర్వం తన ఎడమచెవి ఉన్న ప్రదేశాన్ని చూపించాడు రెండోవాడు తన బుజంమీద వాతల్ని, కోసివెయ్యబడిన చెవి చూపించాడు. మూడోవాడిలా గన్నాడు'

"నాపేరు యోకెల్ ఒకప్పుడు బాగా వున్నరైతునే పెళ్లాం బిడ్డలతో సుఖంగా జీవించేవాణ్ణి, తరవాత నాస్థితి అంతా తారుమారైంది ఇప్పుడు నాపెళ్లాం బిడ్డలు స్వర్గంలో ఉన్నారో నరకంలో ఉన్నారో తెలియదు. ఏమైనా ఇంగ్లండులో మాత్రం లేనందుకు వాళ్లదృష్టవంతులే. మొదట్లో నాముసలితల్లి రోగులకి ఉపచారాలు చేసి సంపాదించుకొనేది ఒకసారి ఒకరోగి చచ్చిపోగా నాతల్లే చంపిందనీ, అది మంత్రగత్తె అనీ నేరంమోపి అధికారులు కాల్చి చంపారు ఇంగ్లీషు శాసనాలకీ జై నాతల్లిని ఇంగ్లీషునరకం నుండి తప్పించినందుకు ఇంగ్లీషు శాసనాలకి జై అందరూ జై అనండి. అదీ, అల్లాగు తరవాత నేను, నాపెళ్లాం ఇంటింటికీ వెళ్లి బిచ్చమెత్తాము కాని ఇంగ్లండులో ఆకలిగా ఉండటంకూడా నేరమే కనక మమ్మల్ని కొరడాలతో కొడుతూ ఊరూరా తరిమారు.

ఆదెబ్బలకి నాపెళ్లాం మేరీ నెత్తురు కక్కుకుని చచ్చిపోయింది జై ఇంగ్లీషు శాసనాలకీ నాపిల్లలగతా? వాళ్లు మలమలమాడి విలవిల కొట్టుకుని చచ్చారు తాగండి మిత్రులారా! మనలాంటి నిర్భాగ్యులపై ఇంగ్లీషు శాసనాలు ఎంత దయగా ఉంటాయో చూశారా? వాటిపేరు చెప్పి ఇంకోసారి తాగండి ఆ, అల్లాగు. నేను మళ్ళీ బిచ్చమెత్తాను. రొట్టెముక్క రావడానికి బదులు నా ఎడమచెవి పోయింది మళ్లీ బిచ్చమెత్తాను. కుడిచెవి పోయింది. ఇంకా బిచ్చమెత్తాను నన్ను పట్టుకుని బానిసగా అమ్మారు. నాచెంప మీద ఈవాత నాబానిసతనానికి గుర్తు నేను బానిసని విన్నారా? ఇంగ్లీషుబానిసని అర్థమైందా? మీ ఎదురుగానుంచున్నాడే వీడు-- వీడు బానిస సరే నేను నాయజమానినుండి కట్లు తెంచుకుని పారిపోయాను. ఈసారి గనక నన్ను అధికారులు పట్టకుంటే ఉరితీస్తారు. జై ఇంగ్లండు దేశానికీ జై ఇంగ్లీషు శాసనాలకీ"

"ఎన్నటికీ అల్లా జరగదు నిన్న ఉరితీసే న్యాయశాసనాలు ఈ రోజునుంచీ రద్దవుతాయి" అని ఎక్కడినుంచో ఈ మాటలు కొట్టొచ్చినట్టు వినబడ్డాయి. ఆవేపు చూశా రంతా గడ్డిమీదనుంచి లేచి బాలరాజు రాజఠీవితో వారి మధ్యకు నడిచివచ్చాడు.

"ఎవరు నువ్వు? ఎందుకొచ్చావు?" అని అందరూ చుట్టుముట్టారు. వారి మధ్య తొణుకూ బెణుకూ లేకుండా ఠీవిగా నుంచున్నాడు బాలరాజు సహజ గర్వంతో సమాధానమిచ్చాడు:

"నేను ఇంగ్లండు సార్వభౌముడైన ఎడ్వర్డును."

ఈ మాటలకి పెద్దపెట్టున అంతా నవ్వారు. బాలరాజుకు ఉక్రోషం వచ్చింది.

"మర్యాద లేని గాడిదల్లారా! మహారాజును హేళన చేస్తున్నారా?" అని గర్జించాడు కాని నవ్వుహోరులో అతని మాటలు మునిగిపోయాయి. నవ్వు సద్దుకున్న తర్వాత "జాన్‌హాబ్స్" సభికులకు తెలియజేశాడు:

"వీడు మా అబ్బాయే లెండి. ఈమధ్య కాస్త పిచ్చెక్కింది వాడి మాటలకు మీరేమీ అనుకోవద్దు. తను మహారాజు నంటూవుంటాడు పిచ్చివాడు"



"నేను మహారాజునే. సమయం వచ్చినప్పుడు నీ కా సంగతి ఋజువు చేస్తాను కూడా. నువ్వు హత్య చేశావని నీ నోటితోనే ఒప్పుకున్నావు. దానికి తగిన శిక్ష అనుభవించేటప్పుడు తెలుస్తుంది నేను మహారాజునో కాదో."

"ఓరి వెధవా! నన్ను రాజభటులకు పట్టిద్దా మనుకుంటున్నావా? నల్లిని నలిపినట్టు నలిపేస్తాను నిన్ను—"

"టట్—టట్," అని అడ్డం వచ్చాడు దొంగల నాయకుడు. బాలరాజుమీదికి సింహంలా దూకబోతున్న హాబ్సును ఒక్క గుద్దులో పడవేశాడు. "ఛీ, నీకు బుద్ధి లేదుటోయ్? కుర్రవాడిమీదికి ఒంటికాలిమీద లేస్తున్నావే? ఇక నాముందు ఇలాంటి వెర్రి చేష్టలు చేశావంటే నిన్ను నేనే ఉరి తీస్తాను." అని మందలించాడు. బాలరాజుకేసి తిరిగి,

"మన మంతా మిత్రులం. నీ మిత్రుల్ని ఇలాగ బెదరించరాదు. వారినిగూర్చి మరెక్కడా పల్లెత్తయినా చెప్పగూడదు. ఇది మన సంఘం కట్టుబాటు. రాజు ననుకోడం సరదాగా ఉంటే అలాగే అనుకో. అంతేగాని మమ్మల్ని చిక్కుల్లో పెట్టకు. ఎందుకంటే నీ పిచ్చివాగుడు అధికారు లెవరైనా వింటే అందర్నీ అరెస్టుచేస్తారు. అది రాజద్రోహం. మనం కొన్ని విషయాల్లో దుర్మార్గుల మైతే కావచ్చు. కాని తనను పాలించే రాజుకే ద్రోహం తలపెట్టేంత నీచుడెవడూ లేడు మనలో. కావలిస్తే మన మిత్రుల రాజభక్తి ఎంత గొప్పదో చూపిస్తాను. (బిగ్గరిగా) అంతా అనండి— ఇంగ్లండు సార్వభౌముడు ఎడ్వర్డుకూ జై!"

"ఇంగ్లండు సార్వభౌముడు ఎడ్వర్డుకూ జై!"

పూరిగుడిసె పునాదులతో సహా ఎగిరి పోతుందా అనిపించేటంత గట్టిగా దొంగలు నినాదం చేశారు.

బాలరాజుముఖం సంతోషంతో వికసించింది. కొద్దిగా తల వంచి అమాయకంగా తన కృతజ్ఞత తెలిపాడు. మళ్ళీ వారిలో హర్షాట్టహాసం చెలరేగింది. నాయకు డన్నాడు: "అబ్బాయ్! నీ పిచ్చి ధోరణి మాను. మంచిది కాదు. కావలిస్తే ఇంకో మంచి బిరుదేదైనా తగిలించుకో మహారాజ బిరుదంమాత్రం వద్దు."

గుంపులోనుంచి ఎవడో ఒక ప్రతిపాదన చేశాడు:

"హాహా హీహీచక్రవర్తి."

తతిమా వాళ్ళు ఈ మాట పట్టుకు

న్నారు వెంటనే "హహ హీహీ చక్రవర్తికీ జై!" అనే నినాదాలు మిన్నుముట్టినై పిల్లికూతలూ, నక్కఅరుపులూ, గాడిదల సంగీతం ప్రారంభమయినై చక్రవర్తిగార వార్థం.

"పట్టాభిషేకం చెయ్యండి"

"ఏదీ ఆ కిరీటం ఇలా అందుకో"

"రాజదండం ఎక్కడ?"

"సింహాసనంమీద కూర్చోపెట్టండి"

పదిమంది చుట్టుముట్టారు నిస్సహాయుడైన బాలరాజును. ఒకడు సీనా రేకుడబ్బా కిరీటంగా అమర్చాడు ఇంకొకడు చిరుగులకంబళిని కప్పాడు. మరొకడు బాలరాజును ఎత్తి సారాపీపామీద ఆసీనుణ్ణి చేశాడు ఇంకొకడు చేతికొక కర్ర నందించాడు రాజదండమనే పేరుతో. ఇదంతా కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయింది. తరవాత అంతా సాష్టాంగప్రణామాలు చేశారు పిల్లికూతలు మొదలైన మంగళశబ్దాలతో గుడిసె హోరెత్తిపోయింది

"మహారాజా! రక్షించండి మీ పేదప్రజల్ని మ్యావ్ మ్యావ్!"

"మీ బానిసలం మహారాజా! మీ మెత్తని పాదంతో ఒక్కతన్ను అనుగ్రహించండి బాయ్‌బాయ్!"

"రాజాధిరాజా! మార్తాండతేజా! శూన్యరాజ్యచక్రవర్తీ! మేం తినే అన్నంలో మీ కాలి దుమ్ము దులపండి అది తినే అదృష్టం మాకు కలిగించండి"

"మామీద ఉమ్మెయ్యండి హాహాహీహీ చక్రవర్తీ! మా మనమలు, మునిమనమలు తమ పేరు సగర్వంగా చెప్పుకుంటారు కలకాలం"

కాని మురాలో ఒక హాస్యగాడున్నాడు బాలరాజును హేళన చెయ్యడంలో ఆ రోజు అగ్రతాంబూలం వాడికే వచ్చింది వాడు వినయంగా మోకరించి బాలరాజు ఎడమకాలు ముద్దుపెట్టుకోబోయాడు. బాలరాజు ఛీఛీమని మూతిమీద తన్నాడు వాడు వెనక్కి పడి, లేచి బాలరాజును బ్రతిమిలాడాడు

"మహారాజా! ఒక గుడ్డపేలిక దయచెయ్యండి తమపాదం తగిలిన చోట కప్పుకుంటాను. పవిత్రమైన ఆ ప్రదేశాన్ని తుచ్ఛమైన గాలిసోకకుండా దాచుకుంటాను మహారాజుపాదస్పర్శతో పులకించిన ఆభాగాన్ని ప్రదర్శనకు పెడతాను వందషిల్లింగు పెడతాను ఒక్కొక్క టిక్కెట్టు ఖరీదు."

హాస్యగాడి మాటలకు మురావాళ్లు పొట్టచెక్కలయ్యేట్లు విరగబడి నవ్వారు సార్వభౌముని కళ్లు అశ్రువులతోను, హృదయం అవమానభారంతోను నిండిపోయాయి. "నేను వీరి కేం అపకారం చేశానని ఇలా అవమానిస్తున్నారు? పైగా ఉపకారమే చేస్తానన్నానే! వీరా నా ప్రజలు?"

★

(ఇంకా వుంది)

---

కారుయజమాని (కొత్తడ్రైవరుతో) ఏమోయ్, కారు రోడ్డుమీద ఎడంపక్కగా పోనివ్వాలనికూడా తెలీదూ?

డ్రైవరు మీ కటువంటి మూఢవిశ్వాసాలుంటే అల్లాగే పోనిస్తాను. నాదేం పోయింది?

* * *

గుమాస్తా: పదేళ్లనుంచీ నే నొక్కణ్ణే ముగ్గురిపని చేస్తున్నాను నాకు జీతం పెంచితీరాలి

యజమాని. జీతంపెంచేమాట కల్లగాని, మిగిలిన ఇద్దరూ ఎవరో చెప్పు.



అనగా అనగా జావా దేశం వీరసింహుడనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయన పరాక్రమంచేత, అనేక రాజ్యాలు జయించి, తనకు సామంతులుగా చేసుకున్నాడు.

వీరసింహునికి ఏడుగురు కొడుకులు. ఏడుగురు రాజకుమారులు, అప్పటికే సౌందర్యవంతులు, బహు పరాక్రమవంతులు. చిన్ననాడే నాయనగారు సమస్తవిద్యలు నేర్పించారు. విలువిద్య వారికి వెన్నతో పెట్టిన విద్య.

వీరసింహుడు జయించిన రాజ్యాల్లో, రత్నపురం అనే సామంతరాజ్యముంది. దానిని రణసింగనే రాజు పరిపాలిస్తూ ఉన్నాడు. ఆ రాజు ఎప్పుడైనా, వీరసింహుని ఓడించి, ఏడుగురు కొడుకులను చంపి రాజ్యమాక్రమిద్దామని చూస్తూన్నాడు. దీనికితోడు తన దగ్గర ప్రచండ భైరవుడనే మంత్రవేత్త ఒకడు ఉన్నాడు. వాడి సహాయంతో, తాను రాజ్యం జయించాలని సమయంగురించి కాచుకొని కూర్చున్నాడు. రణసింగు స్వతహాగా, క్రూరుడు. తన రాజ్యమే కాకుండా చుట్టుప్రక్కల ఉన్న చిన్న రాజ్యాల వారికి రణసింగంటే హడల్. ముందు పిల్లలను తండ్రి దగ్గరనుండి ఎడబాపనిదే ప్రయత్నం నెరవేరదనుకున్నాడు రణసింగు. దీనికి ఏదైనా విధానం ఆలోచిస్తూ ఉన్నాడు.

ఇక్కడ వీరసింహుడు పిల్లలతో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. ఏడుగురు పిల్లలకు మంచి యుక్తవయస్సు వచ్చింది. తండ్రిగారికి ఏ లోటు లేకుండా కాపాడుతున్నారు.

ఒక నాడు ఏడు గురు అన్నదమ్ములు వేటపైన సరదాపుట్టి, తండ్రి గారి అను మతి తీసుకొని బయలు దేరారు. ఆలాగు కొంత దూరం అడవిలో పోతూండగా, వారికి ఒక దివ్యసౌధం కనిపించింది. ఏడుగురు అన్నదమ్ములకు, ఒకవిధమైన ఆశ్చర్యం కలిగింది. మనుష్య సంచారంలేని, యీ నట్టడవిలో యీ సౌధం ఎందుకుందా అనిపించిందిదాని సంగతి. తెలుసుకోవడానికి, వేట సంగతి మరచి బయలు దేరేరు సౌధం దగ్గరకెళ్లే సరికి వారికి, కిల కిల నవ్వులు గాజులధ్వనులు వినబడు తున్నాయి వీరికి మరీ వింతగాఉంది, మనుష్యులు ఎక్కడా కనిపించరు, నవ్వులుమాత్రం వినబడుతున్నాయి. అధైర్య పడకుండా ఇంకా మందిరంలోపలి కెళ్లారు. చక్కని పాటలు, మువ్వలధ్వనులు, వినిపిస్తూన్నాయి. ఎక్కడ చూచినా, ఎవరూ కనిపించరు కొంత సేపటికి ఒక అపురూప సుందరి కనిపించింది ఆమెను చూడగానే, ఏడుగురు, మైమరచిపోయేరు, వారు వచ్చినపనే మరచి, ఆమె ఆటపాటల్లో మునిగి తేలుతున్నారు. కొంత సేపటికి, ఏడుగురు రాజకుమారులు, సొమ్మసిల్లి, మంచంమీద పడియున్నారు. యీ కార్యమంతా రణసింగువద్ద ఉన్న ప్రచండ భైరవుని మాంత్రిక శక్తి ప్రభావంచేత సొమ్మసిలి పడియున్న ఏడుగురు రాజకుమారులను ఏదుపందులుగా జేసి, నిర్జనంగాఉన్న ఒక ద్వీపంలో విడచి పెట్టేశాడు.

వీరసింహుడు వేటకువెళిన కొడుకులు రాలేదని ఆతృతతో, భటులను అన్ని వైపులా పంపాడు, ఎక్కడా పిల్లలజాడ తెలియలేదు. తన వృద్ధాప్యంలో రాజ్యభారం పిల్లలపైపెట్టి, తాను విశ్రాంతి తీసుకుందామనుకుంటే, మధ్య యీ విపత్తు కలిగింది రాజుగారికి, పిల్లల సంగతితప్ప, మరొక గొడవలేదు రాజ్యకార్యాలమీద దృష్టి అసలే లేదు. యీలాగ కొన్నాళ్లు గడవగా, రణసింగుపెద్దసైన్యంతో, ఒక నాడు అర్ధ రాత్రి వీర సింహుని రాజ్యంపైబడి, వీరసింహుని కట్టు బట్టలతో అడవికి తరిమి తాను సింహాసనం ఆక్రమించు కున్నాడు.

వీర సింహుడు చేయునది లేక, తన భార్యతో నట్టడవిలో ఒక పర్ణశాలని నిర్మించుకొని, కాలం గడుపు తున్నాడు. ఆ దగ్గరఉన్న కొండ వాళ్లతో స్నేహంచేసి, తన సంగతంతా వాళ్లతో చెప్పాడు కొండవాళ్లు విచారించి, వాళ్ల చేతనైన సహాయం చేస్తామన్నారు. ఆనాటినుండి, వీర సింహ మహారాజుని, తమ ఏలికగా చూచుకుంటున్నారు.

ఒక నాడు ఏ దేశంనుంచో ఒక మాంత్రిక చక్రవర్తి వీర సింహుడు ఉన్న అడవిమార్గం గుండా రత్నపురం పోతున్నాడు. కొండవాళ్లు, ఆయన్ను చూచి, నమస్కరించి తన ఏలిక దగ్గరకు తీసుకొచ్చారు

వీరసింహుడు ఆ మాంత్రిక చక్రవర్తిని, గౌరవించి, తన దేశ చరిత్రను, సవిస్తరంగా మనవి చేశాడు. రాజు గారి మాటలకు, మాంత్రిక చక్ర వర్తికి జాలికలిగి తప్పక సహాయం చేస్తానన్నాడు తన మంత్ర శక్తివలన, వీరసింహుని పుత్రులు ఎక్కడఉన్నారో తెలుసుకొని, వారిని మనుజులుగాచేసి ఆ ద్వీపంలో వదిలేశాడు.

"రాజా: నీ పిల్లలు, పానండ ద్వీపంలో, పందులుగా ఉన్నారు. వారిని మంత్ర ప్రభావం చేత, మనుజులుగా చేసినాను. వారిని ఇక్కడికి తెచ్చుటకు, నాకు అంత మంత్రశక్తి లేదు, వారికి ఎప్పుడు భార్యలు వస్తే వారే ఇచ్చటకు రాగలరు నీవు వారిగురించి ఎన్ని విధాలప్రయత్నించినా, లాభంలేదు సరికదా, వారి ద్వీపం దగ్గరకు పోయేరా, వెళ్లినవారు, నీ కుమారులు తిరిగి పందులుగా మారిపోతారు. జాగ్రత్త కొంచెం ఓపిక పట్టు" అన్నాడు.

రాజు మారి మాటాడక ఊరుకున్నాడు కొడుకులరాకకు ఎదురు చూస్తూన్నాడు

రాజకుమారులు ఏడుగురు పందులరూపంనుండి మనుష్య రూపంలోనికి వచ్చారు. వారు ఏడుగురు, అడవిలోఉన్న చెట్లనునరికి, అక్కడ వ్యవసాయం ప్రారంభించారు. వారికి కావలసిన తిండిపదార్థాలు పండించు కుంటున్నారు. ప్రతిరోజు వారు కష్టపడి పండిస్తూన్న దుంపలు కాయలు మొదలైనవి ఎవరికి తెలియకుండా ఏదో తినేసి పోతుండేవి. వారి తిండికి లోపంవచ్చేది.

ఒక నాడు ఏడుగురు అన్నదమ్ములు, పందుల సంగతి తెలిసికొందామనుకొని, రాత్రంతా గస్తీ తిరుగు తున్నారు, ఒకరి తరువాత

ఒకరు. ఆఖరి అన్నదమ్ముని వంతు వంచ్చింది, తక్కిన ఆరుగురు నిద్ర లోఉన్నారు. ఆఖరి అన్నదమ్ముడు విల్లమ్ములు ధరించి, గస్తీ తిరుగుతున్నాడు ఇంతలో పందుల అరుపులు వినబడుతున్నాయి, కాని పందులు మాత్రం కనిపించ లేదు వెన్నెల రాత్రిలో పందులు కనబడకపోవడం, అరుపులు వినబడడం, గోతులు ఉండడం అంతా ఆశ్చర్యంవేసింది బాణం ఎక్కుపెట్టి నలువైపులా చూస్తున్నాడు. ఒక మూలనుండి, కసీ కనిపించనట్టు నీడలాగ, పంది కనిపిస్తూంది, ఎక్కుపెట్టిన బాణాన్ని ఒక్కసారిగా వదిలాడు దాంతో పందికి తగిలింది అరుస్తూ పారిపోయింది. వెంటనే చిన్నవాడు గబగబా అన్నలను లేపి పందిజాడ తెలుసుకుందాంపద మన్నాడు వాళ్లు నిద్ర మత్తుమీద, రేపయంపోదాం ఊరుకో మన్నారు చిన్న వాడు మరి మాటాడక, గారితో పండుకున్నాడు.

ఉదయాన్నే ఏడుగురు అన్నదమ్ములు, పందిని వెతకడానికి బయలుదేదారు పంది శరీరంనుంచి కారిన రక్తపు మరకల జాడతో, మెలగా వెతుకుకుంటూ తిన్నగా ఒక గుహదగ్గర కొచ్చారు. ఆ గృహలో నుంచి కొంతదూరం వెళ్లగా, ఒక పాతాళ బిలం కనిపించింది, దానికో గంట వ్రేలాడ గట్టబడిఉంది చిన్నవాడు, అన్నలను వద్దున ఉండమని చెప్పి తాను ఒక నిచ్చెన సహాంతో దిగేడు, వెళ్లగా వెళ్లగా ఒక మైదానం కనిపించింది ఆ మైదానానికి కొంతదూరం, ఒక ఉద్యానవనం, దానిప్రక్కని, పెద్ద భవనం కనబడుతోంది చిన్నవాడు మెల్లగా అక్కడికెళ్లి అంతా చూచేలోపుగా ఒక్కమారుగా, వనం, భవనం, మారిపోయి ఒక సరస్సు క్రింద తయారైంది ఇదంతా చాల ఆశ్చర్య మేసింది మెల్లగా చెరువు దగ్గర కెళ్లి నీరు తాగుదామంటె తిరిగి భవనంక్రింద మారిపోయింది.

చిన్నవాడు మెల్లగా భవనాల వైపు బయలుదేరేడు కొంతదూరం నుండి, ఏడ్పుల ధ్వనులు వినబడుతున్నాయి పోయి చూచే సరికి, ఇళ్లలో మనుష్యులులేరు, ఏడ్పులు మాత్రం వినబడు తున్నాయి. అలాగువెళ్లగా వెళ్లగా ఒక పెద్ద భవనం కనిపించింది ఆ భవనం దగ్గర ఒక ముసలి సిపాయి విచారంగా కూర్చున్నాడు చిన్నవాడు ఏమిటిసంగతి అని అడిగాడు ముసలి యిపాసి "తన రాజుని, ఎవరో బాణంతో కొట్టిరని, అది వీపున దూసుకు పోయిందని, ఎందరు తీయడానికి, ప్రయత్నించినా రాలేదని, ఎవరు దానిని వదిలేరో వారే తీయాలని, లేనిఎడల రాజు అవసాన దశలో ఉన్నాడని" చెప్పేడు

"సరే పద! రాజు ఎక్కడున్నాడోచూపు. నా సాధ్యమైన పని చేస్తాను" అన్నాడు చిన్నవాడు.

ఆ ముసలి సిపాయి వెనుక చిన్నవాడు, రాజభవనము లోనికిపోయి అందరకు ఆశ్చర్యము కలుగునటుల రాజుకి గుచ్చుకొన్న బాణం అతి సుళువుగా, లాగేశాడు.

దానితో రాజుబాధ సగం తగ్గిపోయింది తన ప్రాణాన్ని రక్షించిన వానిని, అనేకవిధాలు గాకొనియాడి, వానిని రెవరాలు కోరుకోమన్నాడు

చిన్నవాడు మొదటి వరం, తన రాజ్యం దుర్మార్గుల చేతిలో ఉంది, దానిని, తన తండ్రిగారి కిప్పించమని కోరేడు రాజు సంతోషంతో, ఎల్లప్పుడు, తనకు స్నేహితునిగా ఉండునటులను, వారి రాజ్యంవారికి ఇప్పించడానికి ఒప్పుకున్నారు

చిన్నవాడు రాజుదగ్గర శెలవు తీసుకొని ఇంటికి పోవడానికి సిద్ధమయేడు, ఇంతలో రాజుగారు, వచ్చి తనకు ప్రాణదానంచేసిన వీరునకు విందారగించి పోవాలని చెప్పేడు చిన్నవాడు రాజుమాట కాదనలేక, సరే అన్నాడు

ఆనాడు రాత్రి రాజు గారు గొప్పవిందు చేసేరు ఆ విందు సందర్భంలో రాజు గారి ఏడు గురు కూతుళ్లు నృత్యం చేయడానికి ఏర్పాటు చేసేడు మంచివిందు సందర్భంలో, ఏడుగురు, మంచి ఒట్టలతో కళ్లు మిరుమిట్లు కొలిపేటట్టు నృత్యం చేస్తూన్నారు కొంతసేపు తరువాత విందు ముగిసిపోయింది.

చిన్నవాడు రాజుదగ్గర శెలవు తీసుకొంటూ "రాజా నీ మాట ప్రకారం" తక్కిన ఏడు వరాలు ఇప్పుడు కావలసి వచ్చింది మాకు రాజ్యానికి పోవడానికి ముక్తిలభించాలంటే మీ ఏడుగురు అమ్మాయిలను, సంతోష పూర్వకంగా మా ఏడుగురి అన్నలకు ఇచ్చిన ఎడల, మాకు విముక్తి అవుతుంది, మీకు, స్నేహములభిస్తుందన్నాడు!"

రాజు గారు యీ మాటలకు సంతోషించి "సరే నా కెట్టి

## ముగ్గురు అన్నదమ్ములు

వ పేజీ తరువాయి)

శక్తిచేత అవన్ని పండ్ల చెట్లుగా మార్చేసి పెద్దవానిని ఆశీర్వదించి తతిమ్మా యిద్దరిని తీసుకొని బయలుదేరాడు.

ఆ ముగ్గురు వక బయలు ప్రదేశమును కొచ్చారు. అప్పుడు ఆముని రెండవ వాణ్ణి పిలిచి 'సి కేం కావాలో తెల్పు' మన్నాడు రెండవ వాడు "మహాత్మా! నాకు గోసంపద

అభ్యంతరం లేదు, కాని మాపిల్లల ఇష్టం కనుక్కుంటాను, వారు ఇష్టపడినఎడల తప్పక ఇస్తాను"అన్నాడు.

రాజు పిల్లలను అడుగగా, వారు సంతోషంతో ఒప్పుకొన్నారు. రాజు కొంత పరివారం, పిల్లల్ని చిన్నవాని వెంట పంపేడు

చిన్న వాడు 7 గురు పిల్లల్ని వెంటబెట్టుకొని బిలం దగ్గరకొచ్చి గంట వాయించేడు కాచియున్న అన్న దమ్ములు, వెంటనే నిచ్చెన లోపలికి దింపేరు ఒకరి తరువాత ఒకరునిచ్చెనగుండా బైటకి వచ్చారు

ఏడుగురు అన్న దమ్ములు ఏడుగురి పిల్లలను పెండ్లి ఆడారు తిన్నగా కొంత పరివారంతో, తండ్రిగారి దగ్గరకువచ్చి, అక్కడ కొంత సైన్యాన్ని తీసుకొని రణసింగు పైబడి వాడిని, వాడి మంత్రవేత్తయగు ప్రచండ భైరవుని చంపి తిన్నగా, తన తండ్రిని సింహాసనం మీద కూర్చో బెట్టేరు ఏడుగురు కన్యలకు అతివైభవంగా వివాహం జరిపేరు అంతా సుఖంగా కాలక్షేపం చేస్తూన్నారు ★

కలిగేటట్లు అనుగ్రహించమన్నాడు 'సరే'నని వానికి గోసంపద కలిగేటట్లు చేసి మూడవవాణ్ణి తీసుకొని బయలుదేరాడు

కొంత దూరం వెళ్లిన తరువాత మూడవవాడు తన మంచి గుణం వుట్టిపడే లాగ 'మీ దయ వుంటే చాలు, నాకింకేమి అక్కరలేదు అని అన్నాడు, కాని ఆ సన్యాసి బలవంతపర్చగా గుణవంతురాలైన భార్యను పెళ్లాడేటట్లు, చెడు అలవాట్లు లేకుండా వుండేటట్లు కోరుకొన్నాడు ఆలాగేనని అతనికి మంచి గుణవంతురాలైన పిల్లను పెండ్లి చేసి ఆశీర్వదించి తన దారిని తాను పొయ్యాడు.

కొంతకాలము జరిగిన తరువాత ఆ సన్యాసి వాళ్లని తిరిగి పరీక్షించ దలచి వేరేరూపంతో మొదటివాని దగ్గర కొచ్చాడు

పెద్దవాడు పళ్ల వ్యాపారము చేసి బాగా డబ్బు సంపాయించాడు ధనవంతుడైనప్పటినుంచి అతను లోభిగా మారాడు బీద సాదలను ఏ మాత్రం కనికరించుట లేదు ఆ సన్యాసి అతని వద్దకు వెళ్లాడు. సన్యాసి రావటముచూసి ఏమడుగుతాడోనని పనివున్న వాడిమాదిరిగా అటు యిటు తిరగటం ప్రారంభించాడు అయినా ఆ సన్యాసి అతని వద్దకు వెళ్లి రెండు పండ్లు తినటానికి యిస్తావా నాయనా! అని అడిగాడు, "ఓ! హో! ప్రతివాడికి పండ్లుదానము చేస్తేనావ్యాపారము దివాలా తీస్తుంది వెళ్లు పండ్లు లేవు గిండ్లు లేవు" అనికసిరాడు ఆసన్యాసి వానిలోభానికి కోపగించి వాడి పండ్లతోట మునుపటిలాగ అడివి అగునట్లు శపించాడు. తత్క్షణమే ఆ పండ్లతోట అడవిగా మారింది పెద్దవాడు ఏడుస్తూ కూలబడ్డాడు

రెండవ వాడు కూడ మొదటి వాడిలాగ ధనవంతుడైనాడు వాడు కూడ ధనం రావటంతోటే తన పూర్వస్థితిని మరచాడు సన్యాసి వాడిదగ్గరికి వెళ్ళి 'నాయనా! కాసిని పాలిస్తావా' అని అడిగాడు. వాడు కూడా తన లోభత్వాన్ని చూపుతూ "లేవ"న్నాడు సన్యాసి వాణ్ణికూడా శపించాడు సన్యాసి శాపమువల్ల వాడిగోసంపద మాయమైంది.

మూడవవాడు మాత్రం తన అన్నలాగ లోభికాక వచ్చేపోయే అతిథి అభ్యాగతులకు తనకున్న దాంట్లో వారికి పెట్టి తృప్తి పరచేవాడు వాడిభార్యకూడా మొగుడికి సాయపడుతూ మంచిగా సంసారము వెళ్ల దీస్తున్నారు.

అక్కడికి ఆ సన్యాసివచ్చాడు. వాళ్లు అతనినిచూసి చాల సంతోషించి నమస్కరించి అతనికి అతిథి పూజచేశారు ఆసన్యాసి వాళ్లమంచితనమునకు సంతోషించి వాళ్లు ఐశ్వర్యవంతులగునట్లుగా వరమిచ్చాడు సన్యాసి వాళ్లకు వాళ్ల అన్నల సంగతిచెప్పగా చాల చింతించి తిరిగి ఎట్లాగైనా వాళ్లు సన్మార్గములోకివచ్చునట్లు అనుగ్రహించమన్నారు సరేనని దీవించి సన్యాసి తన మార్గము అనుసరించాడు.

మొదటిద్దరుకూడా బుద్ధి తెచ్చుకొని అప్పటినుంచి అతిథి అభ్యాగతులకు సేవ చేస్తూ ధనవంతులై సుఖంగా కాలక్షేపము చేశారు ★

# కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో

(8-వ పేజీ తరువాయి)

బర్టుక్సియో తడబడుతున్న అడుగులతో మరొక గదిలోకి వెళ్లి నోట్లకట్టలు చేతపట్టుకుని తిరిగి వచ్చాడు ఏజంటు అతి జాగ్రత్తగా నోట్లు లెక్కపెట్టి మరీ రసీ దిచ్చాడు

"వ్యవహారం పూర్తయిందా?" అన్నాడు మాంట్‌క్రిస్టో.

"పూర్తయిందండి"

"తాళపుచెవులు మీ దగ్గరున్నాయా?"

"ఆ ఇంటి కాపలాదారు వద్ద ఉన్నాయండి ఈ స్వాధీన పత్రం చూపితే ఇల్లు ఒప్పగిస్తాడండి"

"అయితే మీ రింక వెళ్లవచ్చు"

"మీరు పొరపడుతున్నారండి" అన్నాడు ఏజంటు "ఇంటి ఖరీదు ఏభైవేలేనండి"

"మరి మీ కమిషన్?"

"అది చేర్చితేనే ఏభైవేలు"

"మీరు ఆట్వీల్‌నించి ఇంతదూరం వచ్చారు కదా మీ శ్రమకి ఇది న్యాయమే తీసుకోండి"

ఏజంటు ఆశ్చర్యపడ్డాడు గబగబా వెళ్లిపోయాడు మాంట్‌క్రిస్టోని ఒంటరిగా విడిచి అందరూ వెళ్లిపోగానే జేబులోనించి ఒక పుస్తకం తీశాడు పుస్తకాని కొక చిన్న తాళం ఉంది దీని తాళం చెవి ఎప్పుడూ అతని మెడలో పట్టుతాడుకి కట్టి ఉంటుంది పుస్తకం తీసి కొన్ని పేజీలు తిరిగేశాడు ఒక పేజీవద్ద ఆగి చదివాడు

"ఆట్వీల్, ఫాంటేన్ వీధి, 28—అవును ఇదే ఇప్పుడేమి చెయ్యడం? మతంపేర భయపెట్టాలా? లేక ఇతరత్రా భయపెట్టాలా? ఎలా భయపెట్టి నేరాన్ని ఒప్పించాలి? ఏమయితేం! ఒక గంటలో అదే తెలుస్తుంది" తరవాత బర్టుక్సియోని పిలిచాడు అతడు వచ్చాడు

"నువ్వు ఫ్రాన్స్ దేశాన్ని సంచరించినట్లు ఎప్పుడైనా నాతో చెప్పావా?"

"కొన్ని ప్రాంతాలుమాత్రమే చూశానండి"

"పారిస్ నగరం పరిసరాలు నీకు బాగా తెలుసా?"

"తెలియదండి, తెలియదు"

"ఈప్రాంతాలు నీకు తెలియకపోవడం దురదృష్టం ఈ సాయంకాలమే ఆ యిల్లు చూడాలనుకుంటున్నాను నువ్వుకూడా వస్తే నాకు చూపించగలవనుకున్నాను"

"ఎక్కడికి? ఆట్వీల్ గ్రామానికా?"

"అవును అందులో ఆశ్చర్యమేముంది? నే నక్కడుంటున్నప్పుడు నువ్వుకూడా అక్కడికి రావాలి అదేమిటి? ఏమయింది నీకు? నేను బగ్గీకోసం ఇంకోసారి గంట కొట్టాలా?"

బర్టుక్సియో హఠాత్తుగా మేలుకున్నాడు ఒక్క ఉదుటున ముందు వరండాలోకి వెళ్ళి బగ్గీ పిలిచాడు

మాంట్‌క్రిస్టో పుస్తకంలో ఏదో రాసుకుని మూసి తాళం వేశాడు దాన్ని పదిలపరిచి లేచాడు గుమాస్తా తిరిగి రాగానే "రా నువ్వుకూడా" అన్నాడు. ఇద్దరూ వెళ్లి బగ్గీలో కూర్చున్నారు.

## 43

బర్టుక్సియో గాలిలో తన వేలితో సిలువఆకారం చిత్రించుకుని మనస్సులో దైవప్రార్థన చేశాడు ఇరవై నిమిషాల్లో బగ్గీ ఆట్వీల్ గ్రామం చేరింది గ్రామం సమీపించినకొద్దీ బర్టుక్సియో ఆవేగం మరింత హెచ్చసాగింది "ఫాంటేన్ వీధిలో 28 వ ఇంటివద్ద ఆపమని చెప్పు" అన్నాడు మాంట్‌క్రిస్టో గుమాస్తాతో. గుమాస్తాముఖాన్ని శ్రద్ధగా పరిశీలించాడు గుమాస్తాకేక విన్నవెంటనే బగ్గి ఆగింది ఇద్దరూ బగ్గీ దిగి ఎదురుగా ఉన్న ఇంటిని సమీపించారు బర్టుక్సియో తలుపు తట్టాడు కాపలాదారు వచ్చి తలుపు తెరిచి "ఏం కావాలి?' అన్నాడు

"మీ కొత్త యజమాని వచ్చారు" అని గుమాస్తా స్వాధీన పత్రం చూపించాడు

"మీ పూర్వ యజమాని ఎవరు?" అన్నాడు మాంట్‌క్రిస్టో

"మార్క్విస్ సెంట్ మిరాన్" అన్నాడు కాపలాదారు "ఆయనకి ఒక్క కుమార్తెమాత్రం ఉండేది ఆమె నైమ్స్ న్యాయాధికారి విల్‌ఫర్ట్‌ని వివాహంచేసుకుంది తరవాత విల్‌ఫర్ట్ వెర్సేల్స్ వెళ్లారు" మాంట్‌క్రిస్టో బర్టుక్సియోముఖాన్ని పరిశీలించాడు గుమాస్తాముఖం మరింత పాలిపోయింది ఒళ్లు వశం తప్పుతున్నట్లు గోడకానుకుని నిలబడ్డాడు

"ఆ కూతురు చనిపోయింది కాదూ? అలాగని విన్నట్లు నాకు గుర్తు" అన్నాడు మాంట్‌క్రిస్టో"

"అవునండి, అది ఇరవై ఒకయేళ్ల కిందటిమాట ఆ తరవాత ఆమెతండ్రి ఇక్కడికి రెండుమూడుసార్లు మాత్రమే వచ్చారు"

"సరే సరే" అన్నాడు మాంట్‌క్రిస్టో తన గుమాస్తా దుస్థితిని గమనించి ఇంక అతన్ని అట్టే బాధపెట్టడం మంచిది కాదనుకున్నాడు

"బగ్గీకి కట్టిన దీపాలలో ఒకటి తీసుకురా బర్టుక్సియో! ఇల్లు చూపించు"

మాట్లాడకుండా గుమాస్తా ఆజ్ఞ పాలించాడు లాందరు పట్టుకున్న చెయ్యి గడగడలాడుతున్నట్లు స్పష్టంగా కనపడుతోంది కింది అంతస్తు విశాలంగా ఉంది మేడపైన ఒక పెద్దసావడి, నీళ్లగది, రెండు పడక గదులున్నాయి ఒక పడకగదిలోనుంచి వెనుక తోటలోకి దిగడానికి సన్నని సోపానాలున్నాయి

"ఓహో! ఇక్కడ తోటలోకి రహస్య సోపానమార్గముందే!" అన్నాడు మాంట్‌క్రిస్టో "ఇది వీలుగా ఉంది సుమా! బర్టుక్సియో! నువ్వు ముందు వెడుతూ దీపం చూపించు ఈ సోపానా లెక్కడికి దారితీస్తాయో చూడాలి"

"తోటలోకి దారితీస్తాయండి"

"అదే నిర్ధారణగా చూడాలి నడు"

బర్టుక్సియో గాఢంగా నిట్టూర్చి ముందు నడిచాడు తోట ముందు గుమ్మంవద్ద నిలబడిపోయాడు.

"నడు బర్టుక్సియో !" అన్నాడు మాంట్ క్రిస్టో కాని గుమాస్తా నిశ్చేష్టుడై చూస్తు ఉండిపోయాడు అతనికి కాళ్ళాడ లేదు భీతితో గుడ్లు వెలికి వస్తున్నట్లున్నాయి. తోటంతా దేని కోసమో వెదుకుతున్నట్లు కలయచూస్తున్నాడు ఏదో ఘోరదుర్ఘటన సంభవించినచోటుకోసం చూస్తున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది ఒక చెయ్యి ఎత్తి గుప్పిడి బిగబట్టి, స్మృతికి వస్తున్న ఏ ఘోరదృశ్యాలనో తుడిచివెయ్యడానికి యత్నిస్తున్నట్లు కనిపిస్తున్నాడు

"ఏమిటి ?" అన్నాడు మాంట్ క్రిస్టో

"వొద్దు వొద్దు" అన్నాడు గుమాస్తా లాంతరు గోడపక్కన పెట్టేసి "వొద్దండి, రాలేను ఒక్కడుగు ముందుకు వెయ్యలేను" అన్నాడు.

"అంటే ?" అన్నాడు మాంట్ క్రిస్టో గంభీరస్వరంతో.

"చూడండి కౌంట్ ! చూడండి ఇది అసంభవం సహజం కాదు ప్రమాదంవల్ల సంభవించింది కాదు ఇల్లు కొనవలసివచ్చి మీరు ఆట్వీల్ గ్రామంలోనే ఇల్లు కొనడం, కొన్నది ఈ 28 వ నెంబరు ఇల్లే కావడం, ఇది యథాలాపంగా జరిగింది కాదు అయ్యో ! మీ కదంతా ముందే ఎందుకు చెప్పలేదు ? అప్పుడు ఇక్కడికి రావాలని నన్ను మీరు బలవంతపెట్టక పోయేవారేకదా కనీసం ఈ యిల్లైనా కాకుండా ఉంటుందని ఆశపడ్డాను హత్య జరిగిన ఈ యిల్లుతప్ప మరొకటి లేనట్లుగా ఇదే తటస్థపడింది"

"ఆగాగు" అన్నాడు మాంట్ క్రిస్టో అకస్మాత్తుగా అతన్ని మధ్యలో ఆపుతూ "ఏమిటి నువ్వు చెప్తున్న మాటలు ? కట్టిపెట్టింక రా దీపం తీసుకుని తోట చూడాలి నేను దగ్గిరుండగాకూడా భూతాలు వస్తాయని భయపడుతున్నావా"

బర్టుక్సియో మెల్లిగా దీపమెత్తి అనుసరించాడు ఎడమవైపుకి దారితియ్యడానికి ప్రయత్నించాడు "కాదు అలా కాదు ఆ సందులు తిరిగితే ఏం లాభం ? ఇటు రా చిక్కని పచ్చగడ్డి నేల ఇటువైపు ఉంది తిన్నగా వెడదాం ఇటు రా"

బర్టుక్సియో నుదుటిపై చెమట తుడుచుకున్నాడు మెల్లిగా యజమాని ననుసరించాడు కాని కొద్దిగా ఎడమప్రక్కగా నడువ నారంభించాడు మాంట్ క్రిస్టో కుడివైపుకే దారితీసి చెట్లగుంపున్న ఒక చోటకి వెళ్ళి నిలబడ్డాడు ఇంక గుమాస్తా నిలవలేక పోయాడు "ఆగండాగండి అటు వెళ్ళకండి ముందు కన్గు వెయ్యకండి మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను వచ్చెయ్యండి. సరిగ్గా మీ రక్కడే నిలబడుతున్నారు"

"ఎక్కడ ?"

"అతను దెబ్బతిని పడి చచ్చిపోయినచోట"

"నీకు పిచ్చెత్తుతున్నట్టుంది బర్టుక్సియో" అన్నాడు మాంట్ క్రిస్టో అతి సహజధోరణిలో "అదే నిజమైతే నిన్ను తప్పకుండా పిచ్చివాళ్ల ఆస్పత్రికి పంపుతాను సుమా !"

"అయ్యయ్యో ! చివరికి నా దుర్దినం వచ్చిందా ?"

"బర్టుక్సియో ! ఏమిటీ వెర్రి వేషాలు ? ఎందుకలా గుడ్లు వెళ్ళబెట్టి చూస్తావ్ ? దయ్యం పట్టినట్లు ప్రవర్తిస్తా వేమిటి ? రహస్యవేదనకంటె మించిన దయ్యం లేదని నే నెప్పుడూ అంటాను ఆ దయ్యం పట్టుకుంటే విడవడం కష్టం కూడా. నువ్వు కార్సికన్ దేశస్థుడివనీ, నీలో నువ్వు ఏదో నిత్యం బాధ పడుతుంటావనీ, ఎప్పుడో పగ సాధించడంవల్ల మనస్తాపంతో మగ్గిపోతున్నావనీ నాకు తెలుసును ఇటలీలో దాన్ని నే నంతగా పరిగణించలేదు కాని ఫ్రాన్స్ దేశంలో ఇది న్యాయశాసనాలకి విరుద్ధమైనది ఇక్కడ ప్రత్యేకంగా ఇటువంటి వ్యవహారాల నిమిత్తం పోలీసులూ, న్యాయాధికారులూ ఉంటారు ఉరికంబాలుంటాయి బుసోనీ (ఫాదరీ) నాకు అబద్ధం చెప్పారన్నమాట నీ గుణగణాల్ని ప్రశంసిస్తూ ఉత్తరం వ్రాసి నిన్ను నావద్దకు పంపిస్తే నేను నిన్ను నా నౌకరీలోకి తీసుకున్నాను సరే ఇప్పుడు బుసోనీకి నీసంగతి ఉత్తరం వ్రాస్తాను. నీ అక్రమవర్తనకి బాధ్యత ఆయనపైన ఉంటుంది ఈ హత్య ఏమిటో ఉదంతమంతా ఆయనే తెలియపరుస్తాడు నాకు ఒక్కటి మాత్రం మరిచిపోకు నే నే దేశంలో ఉంటానో, ఆ దేశంలో న్యాయశాసనాల్ని అడుగుదాటకుండా పాలిస్తాను ఈ ఫ్రెంచి న్యాయస్థానాల్లో నేను చిక్కుకోడం నా కిష్టంలేదు"

"నే నెప్పుడూ మీపట్ల విధేయతతో మీ సేవ చేస్తున్నానండి నేను నిజాయితీగా మీవద్ద నా కాలం గడుపుకుంటున్నాను నా సాధ్యమైనంతవరకూ మంచే కాని చెడుగెన్నడూ చెయ్యలేదండి !!"

"నే నది కాదనడంలేదు కాని నువ్వింతగా ఎందుకారాటపడుతున్నావు ?"

బర్టుక్సియో కొద్దిగా సంకోచిస్తూ ఇలా అన్నాడు. "అయ్యా ! నాతప్పిదాన్ని నానోట విన్న ఫాదరీ నాహృదయంలో ఏ విషయం గురించి ఆరాటపడుతున్నానో మీకు తెలియచెయ్యలేదా ?"

"చెప్పారు కాని నువ్వు సమర్థతతో నావద్ద నౌకరీ చెయ్యగలవని చెప్పారు అందువల్ల నువ్వు చేసిన తప్పిదం ఏ చిన్న దొంగతనమో అయుంటుందనుకున్నాను"

"అయ్యో !" అన్నాడు బర్టుక్సియో లజ్జపడిపోయాడు

"నువ్వు కార్సికన్ దేశస్థుడివి కాబట్టి పగతీర్చుకోవాలనే కోరికను అణుచుకోలేకపోయుంటా వనుకున్నాను"

"అవునండి" అంటూ బర్టుక్సియో యజమాని పాదాలపైన వాలిపోయాడు అది పగమాత్రమే కాని మరొకటి కాదండి"

"అదైతే నాకు తెలుసును కాని నువ్వింత భయపడిపోవడ మెందుకు ?"

"అయ్యా ! నేను పగతీర్చుకున్నది ఈ యింటిలోనే !"

"ఏమిటి? నాయింట్లోనా?"

"అప్పుడిది మీ యిల్లు కాదు"

"అయితే ఎవరిది? మార్క్విస్ సెంట్ మిరాక్‌కి చెందినదని కాబోలు కాపురాదారు చెప్పాడు మార్క్విస్ పైన నువ్వు పగబట్టడం ఎందుకొచ్చింది?"

"ఆయనపైన కాదండి, మరొకరిపైన"

"చిత్రంగా ఉంది సుమా!" అన్నాడు మాంట్‌క్రిస్టో దీన్ని గురించే యోచిస్తున్నట్లు "నీ కింత ఆరాటం కలిగించే సంఘటన ఎక్కడ జరిగిందో, సరిగ్గా అక్కడికే నువ్వు మళ్ళీ రావడం చిత్రంగా ఉంది"

"ఇది దైవదుర్విపాకం పాపఫలితం మీరు ఆట్వీల్ గ్రామంలోనే ఇల్లు కొన్నారు అదికూడా నేనే యింటిలో హత్య చేశానో, ఆ యింటనే కొన్నారు అతనే మెట్లు దిగి వచ్చాడో, ఆ దారినే మీరు తోటలోకి దిగివచ్చారు అతన్ని నేనెక్కడ నిలబడి కొట్టానో సరిగ్గా అక్కడే మీరూ వచ్చి నిలబడ్డారు ఇక్కడికి సరిగ్గా రెండడుగుల దూరంలోనే పసిపాపను పాతిపెట్టిన సమాధికూడా ఉంది ఇది కేవలం ప్రమాదవశంవల్లనే సంభవించిందనుకోలేను ఇదే నిజంగా అకారణసిద్ధమైన ఘటనైతే, దైవనిర్ణయే కావాలి"

"దైవవిధేననుకో మనస్సు స్థిమితపరుచుకుని జరిగినదంతా చెప్పు"

"ఇదంతా ఒక్కసారి మినహా ఎన్నడూ ఎవ్వరితోనూ నేను చెప్పలేదండి పాదరీకి మాత్రమే చెప్పాను ఇటువంటివాటిని పశ్చాత్తప్తులు మతగురువులకు ప్రమాణంచేసి మాత్రమే నివేదిస్తారు"

"నువ్వు నీమతగురువు దగ్గరైతే ప్రమాణంచేసి చెప్పవచ్చు కాని నాదగ్గిర భయాలకూ భ్రాంతికీ లొంగిపోయే నౌకరుండకూడదు నా నౌకరు నాతోటలో తిరగడానికి భయపడ్డం నాకిష్టం లేదు నీకింకా కార్సికన్ దేశస్థుల మనోదార్ఢ్యం ఉందనుకున్నాను నావద్ద గుమాస్తాపనికి సమర్థుడవనుకున్నాను అక్రమవ్యాపారంలో ఆరితేరినవాడివనుకున్నాను కాని నీలో ఇంత గుప్తచరిత్ర ఉందనుకోలేదు నువ్వింక నావద్ద నౌకరీకి పనికిరావు నీ నౌకరీ వొదులుకో"

"అయ్యో కౌంట్!" అన్నాడు బర్టస్సియో మరింత భీతి చెంది "మీ నౌకరీని వొదులుకోడానికి ఇదొక్కటే కారణమైతే, అంతా తనుసు నివేదిస్తాను మిమ్మల్ని విడిచి వెళ్లానంటే, ఇంక నాకు ఉరితప్ప వేరేదారి లేదు"

"అది వేరు కాని నువ్వు నావద్ద అబద్ధాలు మాత్రం చెప్పనవసరంలేదు అబద్ధంచెప్పడం కంటె, చెప్పకుండా మానడం మేలు మరొకసారి ఆలోచించుకో"

"లేదండి, నిజమే చెప్తాను జరిగినదంతా చెప్పేస్తాను బుసోనీకికూడా నా రహస్యం పూర్తిగా తెలియదు అంతా మీకు చెప్పగలను కాని ఈ చెట్టుదగ్గర నిలబడకండి ఇటు వచ్చెయ్యమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను మీరక్కడ నిలబడిఉంటే నాకు మళ్లీ విల్‌ఫర్డ్ జ్ఞప్తికి వస్తున్నాడు"

"ఎవరు?" అన్నాడు మాంట్‌క్రిస్టో బిగ్గరగా. "ఎవరు? విల్‌ఫర్ట్ మాటా నువ్వు చెప్తున్నది?"

"తమ కాయనగురించి తెలుసునా?"

"నైమ్స్‌లో న్యాయాధికారిగ ఉండేవాడు కాదూ?"

"అవునండి"

"మార్క్విస్ సెంట్ మిరాక్ కుమార్తెను వివాహం చేసుకున్నాడు? అతన్నిమించి నిష్కర్షగా, నిర్దయతో న్యాయపాలన చేసే అధికారి లేడని పేరుపొందిన విల్‌ఫర్టేనా?"

"అవునండి ఇంతటి ధర్మనిర్ణయకర్త లేడని పేరు తెచ్చుకున్న ఈ విల్‌ఫర్ట్ పరమదుష్టుడు'

"నిజమూ! అలా నువ్వు నిరూపించగలవా?"

"ఇదివరలో అయితే నిరూపించగలిగివాడినేనండి"

"ఓ! అయితే ఆ ఆధారాలిప్పుడు పోయినాయన్నమాట ఎంత తెలివితక్కువ!"

"నిజమేనండి కాని ఇప్పుడైనా సరిగా వెతికితే దొరకవచ్చునండి"

"నిజంగా? అయితే నీ కథ వినాలని చాలా కుతూహలంగా ఉంది" అంటూ మాంట్‌క్రిస్టో దగ్గరలో ఉన్న ఒక బల్లపైన కూర్చున్నాడు



కుర్రాడు అమ్మా, అమ్మా! చూడు ఆయన నెత్తిన ఒక్క వెంట్రుకన్నా లేదు

తల్లి గట్టిగా అనకురా, వెధవా!

కుర్రాడు. ఏమమ్మా, ఆయనకింకా ఈ సంగతి తెలీదా!

* * * *

"అమ్మా, మీ అల్లుడికి నరకమంటే నమ్మకంలేదు!'

"నువు కాపరానికివెళ్లిన తరవాత ఒక నెల్లో అటువంటి నమ్మకాలు కలిగింతువు గాని లే."

# డైరీ

## (4-వ పేజీ తరువాయి)

—కాశ్మీర్ మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం ఢిల్లీలో పండిట్ నెహ్రూను కలుసుకుని గంటసేపు మాట్లాడాడు

—అమెరికా స్వాతంత్ర్య వార్షికోత్సవసందర్భంలో ఉపన్యసిస్తూ అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్, కొరియాలో యుద్ధం ముగిసినా ప్రపంచంలో యుద్ధ ప్రమాదం నివారణ కాలేదన్నాడు

—1950-51 లో విదేశాలతో వ్యాపారంవల్ల భారత దేశానికి రు 21 కోట్లు లాభం వచ్చిందనీ, మొత్తం వ్యాపారం విలువ రు 1100 కోట్లు ఉంటుందనీ ప్రభుత్వంప్రకటించిన లెక్కలవల్ల తేలింది

—మద్రాసు ఆహారశాఖ సలహా సంఘంలో ఉపన్యసిస్తూ ముఖ్యమంత్రి కుమారస్వామి రాజాగారు రాష్ట్రంలో ఆహారపరిస్థితిని గురించీ, ఆహారోత్పత్తి వృద్ధికోసం అనుసరిస్తున్న కార్యక్రమం గురించీ వివరించారు

—సోషలిస్టుపార్టీ ఎన్నికల నివేదిక కలకత్తాలో ప్రచురించబడింది

### గురువారం, జూలై 5

—కొరియా యుద్ధ విరామ సమాలోచనల సందర్భంలో కైసాంగ్ లో జూలై 8 వ తేదీ సమావేశానికి కమ్యూనిస్టుల సూచనకు సమితి సేనాధిపతి జనరల్ రిడ్జివే సమ్మతించారు

—పర్షియా ఆయిల్ వివాదం సందర్భంలో బ్రిటన్ ఫిర్యాదును పరిష్కరించే వరకూ బ్రిటన్ పర్షియాలు తొందరపాటుతో ఎట్టి చర్యలకూ దిగకూడదని అంతర్జాతీయ న్యాయసంస్థ తీర్పు ఇచ్చింది

—ఒక ఆయిల్ టాంకర్ కంపెనీకి ౧ % తరుగుదలతో (డిస్కౌంట్) అమ్మడానికి పర్షియన్ ప్రభుత్వం అమ్మ చూపింది

—ఆయిల్ పరిశ్రమ సమస్యమూలంగా ఆర్థికంగా క్లిష్టసమస్యలు సంభవించగలవనీ, ఈపరిస్థితిలో పర్షియన్ ప్రజలను ప్రభుత్వంఋణాలను కోరగలదనీ ప్రధాని ముసాదిక్ ప్రకటించాడు

—కాశ్మీర్ మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం పండిట్ నెహ్రూను కలుసుకుని రెండుగంటలసేపు చర్చించారు

—పాకిస్తాన్ అధికారులతో మాట్లాడి తిరిగి శ్రీనగర్ వచ్చిన సమితి సైనికపర్యవేక్షణాధికారి మేజర్ జనరల్ నిమ్మో కాశ్మీర్ లో యుద్ధం ప్రజ్వరిల్లేప్రమాదం లేదన్నాడు

—ప్రస్తుత క్లిష్టస్థితిలో ఆహారవస్తువుల సరఫరా ముఖ్యావసరం కాబట్టి రైల్వే కార్మికులు సమ్మెచెయ్యరాదని పండిట్ నెహ్రూ విజ్ఞప్తి చేశారు

—కరువు భత్యం మినహా సమిష్టిసలహా సంఘంలో చర్చించబడని కొత్తవివాదాంశాలేవైనా ఉంటే వానిని పరిష్కరల నిర్ణయానికి ఒప్పగించడానికి భారత ప్రభుత్వం సిద్ధంగా ఉన్నట్లు రైల్వేశాఖ స్టేట్ మంత్రి సంతానంగారు ప్రకటించారు

—ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు నీలం సంజీవిరెడ్డిగారు అధ్యక్షతకు రాజీనామా నిచ్చారు

—తెలంగాణాలో కమ్యూనిస్టులకూ ప్రభుత్వానికీ మధ్య రాజీకుదర్చడానికి కృషిచేస్తున్న లెఫ్టినెంట్ కల్నల్ కె యస్ వాఘ్రు, అతావుర్ రహ్మన్, మందుముల నరసింగరావుగార్లు ప్రభుత్వ ప్రతినిధులతో సంప్రదించి, వారి అనుమతిపైన కారాగారంలో ఉన్నకమ్యూనిస్టు నాయకులతో సంప్రదింపులు జరిపారు

### శుక్రవారం, జూలై 6

—కైసాంగ్ యుద్ధవిరామ సమాలోచనలకు ఏర్పాట్లను గురించి కొరియాలోని ఉభయపక్ష సేనాధిపతులకు సమ్మతి కుదిరింది

—జపాన్ తో శాంతి సంధివిషయమై ఈసంధిలో ప్రమేయం కలదేశాల ప్రతినిధులందరూ సెప్టెంబర్ 4 వ తేదీని శాన్ ఫ్రాన్సిస్కోలో సమావేశమై, అమెరికన్ ప్రభుత్వం తయారుచేసిన సంధిపత్రాన్ని చర్చించగలరని అమెరికన్ విదేశాంగ శాఖ ప్రకటించింది

—హేగ్ కోర్టు నిర్ణయం ప్రకారం ఉభయపక్షాలూ ఎట్టి చర్యలూ తీసుకోకుండా గమనించడానికిగాను అజమాయిషీ సంఘాన్ని నియమించాలని బ్రిటిష్ ప్రభుత్వం పర్షియన్ ప్రభుత్వాన్ని కోరింది హేగ్ కోర్టు నిర్ణయాలను పాటించబోరని పర్షియన్ ప్రధాని డా॥ ముసాదిక్ టెహరన్ లో ప్రకటించార

—జూన్ 26 నుంచి 30 వరకూ తిరిగి నాలుగుమార్లు కాశ్మీర్ పై పాకిస్తానీలు దాడి చేశారని భారతప్రభుత్వం భద్రతామండలికి రెండవసారి ఫిర్యాదు చేసింది

—ఐక్యరాజ్య సమితివల్ల కాశ్మీర్ ప్రజలకు న్యాయం చేకూరదనీ, ఎవరు నిరోధించడానికి యత్నించినప్పటికీ లక్ష్యపెట్టక కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తును నిర్మించి తీరగలరనీ కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా ప్రకటించారు.

—కాశ్మీర్ మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం భారతప్రధాని నెహ్రూతో నేడు రెండున్నర గంటలు సమాలోచనలు జరిపారు

—ఆగస్టు 27 నుంచి సమ్మెచేయాలని అఖిలభారత రైల్వే కార్మిక సంఘ సమితి జనరల్ కౌన్సిల్ ఖర్గపూర్ సమావేశంలో నిర్ణయించింది

### శనివారం, జూలై 7

—రష్యన్ ప్రజలపట్ల అమెరికన్ ప్రజల సుహృద్భావాన్ని ప్రకటిస్తూ అమెరికన్ కాంగ్రెస్ చేసిన తీర్మానాన్ని అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ సోవియట్ రష్యన్ అధ్యక్షుడు ష్వెర్నిక్ కు పంపాడు.

—రష్యా, రుమేనియా, బల్గేరియా, దేశాలతో ఇదివరలో అమెరికా చేసుకున్న వాణిజ్యపు టొడంబడికలన్నీ రద్దుపరచబడినట్లు, అమెరికన్ ప్రభుత్వం ప్రకటించింది

—జనరల్ మెకార్థర్ ను బర్తరప్ చేసే అధికారం అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ కి ఉన్నదనీ, అయితే అది సవ్యంగా జరగలేదనీ విచారణ సంఘానికి చెందిన రిపబ్లికన్లు నివేదించారు

—తూర్పు బెర్లిన్, పశ్చిమ బెర్లిన్ ప్రాంతాలమధ్య కొత్త వ్యాపారపు టొడంబడిక జరిగింది

—థాయిలాండ్ లో సైనిక నియంతృత్వం స్థాపించబడలేదనీ, ఫిబుల్ సంగ్రామ్ ప్రభుత్వాధికారాన్ని స్వీకరించాడనీ థాయిలాండ్ ప్రభుత్వం ప్రకటించింది.

—బర్మా, భారత ప్రభుత్వాలమధ్య అయిగేళ్ల మైత్రి ఒడంబడిక జరిగింది

—గతనాలుగేళ్లుగా కాంగ్రెస్ సాగించిన పరిపాలనగురించీ, దేశ పరిస్థితులను గురించీ పండిట్ నెహ్రూ నివేదికనొకదానిని ప్రమరించారు ఈ నివేదికఆలిండియా కాంగ్రెస్ కమిటీలో చర్చించబడుతుంది

—జమీందారీలను రద్దుపరిచినందుకు పరిహారం చెల్లింపుకోసం మద్రాసు ప్రభుత్వం ఇంతవరకు 3 కోట్ల 76 లక్షల రూపాయలు ట్రిబ్యునల్స్ కు ఒప్పగించినట్లు ముఖ్యమంత్రి కుమారస్వామి రాజాగారు పత్రికా సమావేశంలో ప్రకటించారు

—తిరువాన్కూరు - కొచిన్ శాసన సభనుంచి రాజీనామా నివ్వాలని కొచిన్ కాంగ్రెస్ సభ్యులు నిర్ణయించారు ★

# వ్యవసాయ సంస్కరణలు

(3 వ పేజీ తరువాయి)

ల్యాండ్ ట్రిబ్యునల్స్ నియమించి కూలీల కనీస వేతనాల నిర్ణయం కౌలుదారు పట్టాదార్ల తగాదాల పరిష్కారం భూమి పరిమితంచేసే నియమాల అనుసరణ మొదలైన సమస్యలను ఒప్పగించాలి

ఇవి వీరి సలహాలలో ముఖ్యమైనవి

ఇదివరలో కుమరప్ప కమిటీ నివేదికను ప్రభుత్వం ఆమోదించలేకపోయింది ఆ నివేదికలో సూచించబడిన సంస్కరణలు విప్లవాత్మకమైనవేగాక అంతగా ఆచరణయోగ్యమైనవిగావు అదీకాక వ్యవసాయ వృద్ధి నిమిత్తం ఇప్పటికంటె ఎక్కువ ధనాన్ని ఎలా వెచ్చించాలో ఆ ధనాన్ని ఎలా సేకరించాలో (ప్రభుత్వ సహాయం మినహా) ఆ కమిటీ సూచించలేకపోయింది ప్రభుత్వ సహాయాన్ని ఏమాత్రమూ అపేక్షించలేని ప్రస్తుత పరిస్థితిలో వ్యవసాయానికి పెట్టుబడిని ఏవిధంగా ఆకర్షించాలో వారు నివేదించలేదు వాస్తవానికి ఈనాడు దేశంలో వ్యవసాయం వృద్ధి కావటం లేదంటే కారణం పెట్టుబడి కొరత కావడమే రిజర్వుబాంకు వారి నివేదిక ప్రకారం మనదేశంలో వ్యవసాయం నిమిత్తం వెచ్చించబడుతున్న పెట్టుబడిధనం నూరింట పదివంతులు కూడా లేదు ఈ పెట్టుబడికి బాంకులతో బొత్తిగా నిమిత్తం లేకుండా ఉంది అందువల్ల వ్యవసాయానికి పెద్ద యంత్ర పరికరాలను కూడా వినియోగించడానికి గాని, చాలినంతగా ఎరువులు వెయ్యటం ఇతర ఖర్చులకు సరబాటు చేసుకోటానికి గాని వీలులేకుండా ఉంది వ్యవసాయానికి పెట్టుబడి పెట్టగలవారిని ఆకర్షించవలసిన ఈరోజులలో ఏ యేడాది కాయేడు స్వల్పధనం కోసమైనా అప్పులు చెయ్యవలసిన రైతులే వ్యవసాయానికి ఆధారమై ఉన్నందువల్లనే ప్రభుత్వం ఎంతప్రయాసపడి ఎన్నికోట్ల రూపాయలు వెచ్చించినప్పటికీ పంటలు వృద్ధికావటంలేదు తగినంత నీటి వసతులుండీ కూడా అనేక ప్రాంతాల భూములలో పంటలు తగిపోతున్నాయంటే సేద్యం చేసేవారి పేదరికమే కారణం ఇప్పుడిప్పుడే కొందరు కొందరు రైతులు పొగాకు పసుపు మొదలైనవి పండించి కొద్ది కొద్దిగా ధనం సేకరించగలుగుతున్నారు కాని దేశంలో అన్ని రకాల వస్తువుల ధరలూ పెరిగిపోవడంవల్ల వీరి ధనంలో స్వల్పభాగం అతి కష్టంమీద వ్యవసాయానికి పెట్టగలుగుతున్నారు ఆపైన జమీందారీలు రద్దుకాగా స్వంత కమతాలను మిగుల్చుకున్నవారు పరిహారం రూపేణా ధనం పుష్కలంగా లభిస్తున్నది కాబట్టి స్వంత కమతాలలో పెద్ద యెత్తున వ్యవసాయం చెయ్యడానికి ఈమధ్యనే తలపెడుతున్నారు కేవలం దున్నేవారికే భూమి చెందాలని చేసే నినాదాలకు ప్రభుత్వం లొంగుతుందనే భయం పెద్దరైతులనేకుల్ని బాధిస్తోంది అందువల్ల కుమరప్ప కమిటీ నివేదికను మద్రాసుప్రభుత్వం నిరాకరించడంతో తిరిగి వీరు పెద్ద మొత్తాలు పెట్టుబడి పెట్టి వ్యవసాయం ప్రారంభించారు ఇప్పుడు సుబ్రహ్మణ్యం కమిటీ నివేదిక వల్ల మరొకరకం పట్టాదార్లకు భీతిగలిగే అవకాశం ఉంది పట్టాదారుకి పంటలో నూరింట 40 వంతులే ఇవ్వడంవల్ల వ్యవసాయానికి పెట్టుబడి పెట్టే తాహతు వారికి లేకుండా పోతుంది కౌలుదార్లకు అంతకంటె తాహతుండదు దీనివల్ల మరొకరకం పట్టాదార్లు భూముల్ని వొదులుకోవడం సంభవించవచ్చును ఆయాప్రాంతాలలో భూముల పరిస్థితిని గమనించి వ్యవసాయానికి పెట్టుబడి పెట్టడానికి ఏ వర్గంవారిపై ఆధారపడవచ్చునో చూసి ఆ ప్రకారం ఏ ప్రాంతానికి తగిన పద్ధతుల్ని ఆ ప్రాంతాలలో ప్రవేశపెట్టడం మేలు చాలా ప్రాంతాలలో వ్యవసాయపు పెట్టుబడిలో పట్టాదార్లుకూడా కొంత భరిస్తున్నారని మరిచిపోకూడదు ఇటువంటి ఒకటి రెండు అంశాలలో తప్ప మిగతా సూచనలలో చాలవరకు ఆచరణయోగ్యమైన వానినే సుబ్రహ్మణ్యం కమిటీ సూచించింది

వ్యవసాయాభివృద్ధికి తోడ్పాటు చేసే పెట్టుబడిని ఆకర్షించే దృష్టిని ప్రభుత్వం మరిచిపోకూడదు ఈ దృష్టితో చూస్తే కొన్ని ముఖ్య సవరణలతో, సుబ్రహ్మణ్యం కమిటీ నివేదిక ఆచరణయోగ్యమైనదని చెప్పాలి



భారతదేశానికి ధాన్యాలసప్లయి బిల్లుపై అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ సంతకం చేశాడు

Edited Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press 7 Thambu Chetty St Madras

# రాజా

స్నో, హేర్ఆయిల్
కస్తూరిసోపు, హేర్ ఫిక్సర్

FAS

Use RAJA Face Powder & RAJA TOOTH Paste

RAJA (TRADE MARK)

AGARRATHI
2 TOLAS

MANUFACTURERS:
MANYAM & CO.,
BANGALORE. 3.